# జయప్రకాశ్ లేఖలు

(సోషలిస్టు పార్టీ కార్యక్రమము)



రచన:

జయప్రకాశ నారాయణ



అనువాదం:

మదివర్తి సత్యనారాయణ

# జయప్రకాశ్ లేఖలు

(సోషలిస్టు పార్టీ కార్యక్రమము)



రచన:

జయప్రకాశ నారాయణ



అనువాదం:

మునివర్తి సత్యనారాయణ

# ముందుమాట

"నీ ప్రతిభను జూచి నేను, భారతదేశమే కాదోయి విశ్వప్రపంచము ముగ్ధమై పోవుచున్నదని" హృదయపూర్వకంగా అభినందించాడు, భారతభాగ్యవిధాత మహాత్మాగాంధీతాత. "ప్రాచ్యదేశపు లెనిన్" అన్నాడు పాశ్చాత్యుడు బ్రాక్వే. ఓ జయప్రకాశ్ ధన్యత చెందింది నీ జీవితం. సువర్ణాక్షరాలతో భావిచరిత్ర నిన్ను అభినందిస్తుంది.

జయప్రకాశ్ జీవితమే ధన్యత జెందిందిగాని, ఆశయము యింకా ఫలసిద్ధి పొందలేదు. అందుకొరకే పాటుబడుచున్నాడు యీ వీరధనుడు. ప్రజాహృదయాన్ని ఆకర్షించేట్టు వ్రాయడమే కష్టం. దానికి మించిన పని కార్యక్రమంతో సహకరించడం, ఆచరణలో బెట్టి, ప్రజాశ్రేయస్సును సాధించుటకు ముందుకు దూకుట మరీదుర్గమమగు మార్గం. స్వాతంత్ర్య సముపార్జనకు యీమూడవ స్థాయియే కీలకమగుమార్గము. కాని, యిది బహుకష్టతర మార్గము. అయినను యీబాటను బట్టినపుడే విప్లవమును సాధించగల మనుచున్నాడు జయప్రకాశ్. ఈ ఆశయసిద్ధికి, అనుసరించవలసిన కార్యక్రమ ఫలకాన్నే యీ మూడు లేఖలలో చిత్రించాడు.

కార్యసాధనకు నాయకత్వం వహించ సమర్థుడగుటకు తోడు, పరిస్థితుల పూర్వాపరముల అంచనా వేయుటలో యితడు అందేవేసిన చేయి. కమ్యూనిస్టుల

గూర్చియు, ముస్లిములీగును గూర్చియు, 1943 లోనే ఖచ్చితమగు నిశ్చిలాభిప్రాయాన్ని యివ్వగలిగాడు. సుభాసుబాబుయొక్క విశిష్టతను త్యాగశీలతను తీర్చి దిద్దినట్లు విప్పిచెప్పి; యీ నాయకుడు మనకు యెంత వరకు వుపయోగపడగలడో, అట్టి అవకాశాన్ని సక్రమంగా వుపయోగించుకొనుటకు అప్రమత్తులముగాక, యెట్టికార్యక్రమాన్ని నిర్వహించాలనో, సూటిమార్గాన్ని సూచించాడు. గాంధీజి నిర్మాణ కార్యక్రమమును, పోరాట కార్యక్రమానికి జతపరువవలసిన విశేషతను తెలియజేయుచు, కాంగ్రెసు సంఘములలో, పార్లమెంటరీ విధానము మూలమున, అవకాశవాదులు యెట్లు గూడుపుఠాణి చేయుచున్నారో వేలుబెట్టి చూపాడు. దీన్ని అంతమొందించ ప్రతినబూనమన్నాడు.

విప్లవమే ఆశయము, పోరాటమే మార్గము, త్యాగానికే అంకితంగావాలను పట్టుదలతో, మన సాటిలేని మహా నాయకుడు వుపదేశించిన "కరేంగే యా మరేంగే" యను మంత్రాన్ని జపించుచు కార్యక్రమము కొనసాగింప ముందుకు దూకు సమరవీరుల నుద్దేశించియే యీ లేఖలు వ్రాశాడు.

అల్ప సారాంశాలను పాటింపగూడదు, ప్రత్యేకతను స్వార్థపరాయణత్వాన్ని తుది ముట్టించాలి. ప్రచారానికన్నా త్యాగము ముఖ్యం; త్యాగమే స్వాతంత్ర్య పోరాటానికి నాయకమణి అని ప్రబోధించుచు, ప్రతి

స్వాతంత్ర్య సమరవీరుడు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీసందే శాన్ని పల్లెపల్లెలలోను వాడవాడలలోను చాటిచెప్పి, ప్రజాహృదయ నాళాలలో ప్రతిబింబించునట్లు చేయుమని ఉపదేశిస్తున్నాడు.

సంగ్రహంగా ముఖ్యావసరమగు కార్యక్రమాన్ని మన ముందుంచి, వివిధ ఆశయాలతో, వివిధ ప్రయోజ నాలకు ప్రతివారు దీన్ని వుపయోగించ ప్రయత్నించుకో వచ్చునని హెచ్చరించి వాడు మన పరమావధి విజయవంత మగు విప్లవము, యీ మనోరథము మనల శాసించు అంకు శమై, స్వాతంత్ర్య సాధనకు పురికొల్పాలి, అని నిరూ పించి, స్వాతంత్ర్యముతోపాటు, సామ్యవాదము సాధిం చుట పార్టీ ఆశయమని తేల్చివేశాడు.

## 2

ఆగస్టు విప్లవముతో ప్రతివర్గములోను అపరిమిత మగు చైతన్యంవచ్చింది. కార్మికులు వారి పోరాట పటి మను గుర్తించారు. కాని రాజకీయదృక్పథంలేని పార్టీలు కార్మికులను తప్పుత్రోవలకుత్రిప్పి, రాజకీయ ఆశయాలను మరచిపోవునట్లు చేయుచున్నారు. సమ్మె కార్మికులకు వారి బలాన్ని తెలియజేస్తుంది, ఒక ఫ్యాక్టరీలో సమ్మె జేసి విజయము బొందినట్లే, దేశము మొత్తము కార్మిక సంఘాలు యేకమై పోరాటము సల్పినచో పాలనాయం త్రాన్నే కైవసం చేసుకోవచ్చునని కార్మికులకు బోధ

పరచుటకే సమ్మె ఒకసాధనం. ఊరక ఆర్థికంగా యేదో కొంత ఫలితాన్ని పొందినందువల్ల ప్రయోజనం లేదు. ఊపిరాడక నీకు యేదో బిక్షమిచ్చినట్లు సాయపడు యజమానులు అవసరం వచ్చినపుడు తోకకత్తిరించుటకు కూడా అవకాశముంది. ఉదాహరణకు;—యుద్ధంరోజులలో కీలకములగు రైల్వేకార్మికులకు బాగా ఆర్థిక స్వాయ మిచ్చి, ఆగస్టు విప్లవము పురవడినుండి మరలించేశారు. ఇట్లే దేశములో ప్రతిచోటా జరుగుచున్నది.

కార్మికులు కర్షకులు యింకో విషయం గమనించాలి. ఆగస్టు విప్లవంలో అఖండ త్యాగాలు జేసినను స్వారాజ్యము యింకా దూరంగానేవుంది. మన నాయకులు పార్లమెంటరీ విధానాన్ని కూడా పోరాటానికి ఒక ఆయుధం చేయుచున్నారు. కాని, నిజమగు స్వాతంత్ర్య సమర వీరులు, రానున్న విప్లవమునకు కార్మికకర్షకుల కూడ గట్టుక రావాలిగాని, పదవీవ్యామోహంలో పడకూడదు. కాల పరిమితి చాలాకొద్ది. కాననే సోషలిస్టు నాయకుడు జయప్రకాశ్, సమ్మెల మూలంగా కార్మికులలో మెట్టి పరిజ్ఞానాన్ని కల్పించాలో ఆర్థికమే పరమార్థంగా బెట్టు కొన్న, యెట్లు సర్వనాశనమౌతామో విశదీకరించి హెచ్చరించాడు. పోరాటానికి ప్రాణమువంటి కొంత కార్యక్రమాన్ని బట్టబయలు చేయ వీలులేదు గాన యిచ్చట చర్చించనన్నాడు. కాని ఓపికతో సర్వత్యాగానికి సన్నద్ధమైన స్వాతంత్ర్య సమరవీరులు సమ్మెకము

కలిగించి, ధైర్యముజూపితే ఆ కార్యక్రమాన్ని గ్రహించ వీళ్ళుంటవి.

## 3

ఆంధ్రాలో అవకాశవాదం బాగా కాలుబోసు కుంటున్నది. స్వాతంత్ర్య సమర వీరులు లెక్కకు మిక్కుటముగా నున్నారుగాని చెల్లాచెదరుగా నున్నారు. వీరి నందరను కూడగట్టుట మన పరమావధి. అట్టి కార్య క్రమానికి సమర్థులు పూనుకోవాలి.

ఆగస్టు రోజులలో గుంటూరుజిల్లాలో ఒక పథకము ప్రకారమువిప్లవము నడచింది. గవర్నరు గుంటూరు జిల్లాలో అడుగుబెట్టుటకు దద్దరిల్లాడు. రాష్ట్రానికి విప్లవ కేంద్రమని అలమటించిపోయాడు. సర్వసన్నాహాలు జరుగుతుండగానే ద్రోహం జరిగింది. విప్లవ ద్రోహులే లోన చేరకుండావుంటే; సతారాకు యీడుబోదని నిరూపించగల ఘట్టం జారిపోయింది. దీనికి క్రామేడు చీమకుర్తి శేషగిరి రావు నాయకత్వం వహించి నడిపాడు. ఇట్టిమహామహులు, త్యాగశీలురు రాష్ట్రమందు అచ్చటచ్చటను వుండ వచ్చును. వీరు యేకమై కార్యక్రమాన్ని అనతికాలంలో ఆచరణలో పెట్టుటకు వుపక్రమించాలని హృదయ పూర్వకంగా విన్నవిస్తున్నాను. త్వరలో వీరు పార్టీ కార్యక్రమాన్ని సాగించ పూనుకొనునపుడు; ప్రతి స్వాతంత్ర్య సమరవీరుడు; అల్పసారాంశాలను; వ్యక్తిగత భేదాలను పాటింపక చేయూత నివ్వవలయునని కూడా

మా ప్రార్థన. అప్పుడే యీ అవకాశవాదాన్ని త్రుంచి తల్లక్రిందులుగా దొర్లించగలం. స్వాతంత్ర్యరిపబ్లికును సాధించగలం.

పార్టీకేంద్రాలు యింకను రాష్ట్రమంతయు నెల కొనలేదనుట సువిదితమేగదా ! కాని గుంటూరుజిల్లాలో తెనాలి కేంద్రంగా ప్రస్తుతానికి తాత్కాలికంగా కాంగ్రెసు సోషలిస్టు కౌన్సిలును యేర్పరచారు, ఈవిధంగానే అన్ని జిల్లాలు పూనుకోవాలి. పార్టీ వర్కర్లకు అత్యంత వుపయోగకరములగు యీ మూడు లేఖలను; అనతి కాలంలో ప్రచురింపనున్న యితర సోషలిస్టు నాయకుల సందేశాలను, పార్టీసందేశాలను విరివిగాఅన్ని జిల్లాలలోను మారుమూలలకు కూడా వ్యాపింపజేయువలెను.

ఒంగోలు } విప్లవాభి వందనములతో
10—9—46 } ముదివర్తి సత్యనారాయణ.

# పరిచయం



ఆగస్టులో నాయకులు అరెస్టు కాగానే కర్తకర్తి లేక ప్రజలు విరుచుకపడ్డారు. ప్రభుత్వం భీభత్సమై పోయింది. కాని, సరియగు నాయకత్వం, నిర్మాణ సంస్థ లేకపోవుటచే, తర్వాత చేయవలసిన విధిని ప్రజలు గుర్తెరుగలేకపోయారు, ఇట్టి సమయంలో అదృష్టవశాత్తు, ప్రతిభావంతుడు సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ నారాయణ జైలునుండి తప్పించుకొని, స్వాతంత్ర్య సమర వీరులకు అండయై, కార్యక్రమాన్ని చూపాడు.

ప్రచ్ఛన్నముగా సంచరించుచు సమయోచితంగా కార్యక్రమ విధానమును సూచించుటకి ప్రథమ రెండు లేఖలు వ్రాశాడు. తర్వాత కార్యక్రమం జోరుగా సాగిపోవు రోజులలో ద్రోహుల మూలాన అరెష్టు కాబడ్డారు. జైలు వెలువడగానే స్వాతంత్ర్య సమరవీరులకు సందేశము నిచ్చుచు, తర్వాత కార్యక్రమాన్ని సూచిస్తానని హామీనిచ్చి, వెనువెంటనే నాయకులతోను, సహచరుతోను సంప్రదించి మూడవలేఖను మనకు అందించాడు.

బ్రిటిషు ప్రభుత్వాన్ని, దీనిగులాములను, ఇండియా నుండి మూట ముల్లెలతో పడవ ఎక్కించు నంతవరకు యీ లేఖలు స్వాతంత్ర్య సమరవీరులకు పరమ ప్రమాణములు, కాన యీ చరిత్రాత్మకమగు లేఖలు యే ఆశయ సిద్ధాంతవాదయైనను, స్వాతంత్ర్యముతో కూడ సామ్యవాదాన్ని సముపార్జింప పాటుబడువారికి, అత్యంత వుపయోగకరమైనవి,

త్వరలో సోషలిస్టు నాయకులు ఆంధ్ర దేశంలో సంచార కార్యక్రమాన్ని సాగింపనున్నారు. ఈ లోపున సోషలిస్టుపార్టీ దృక్పథమేమిటో; పార్టీ సూచించు కార్యక్రమానికి, కాంగ్రెసు మహాసంస్థ కార్యక్రమానికిగల సంబంధ బాంధవ్యాలెట్టివో, తెలిసికొనుటకు యీ లేఖలు చాల ముఖ్యములైనవి. కాన విధిగా ప్రతి స్వాతంత్ర్య సమర వీరుడును యీ పుస్తకాన్ని ప్రచారములోనికి తెచ్చుట తన కర్తవ్యముగా భావించవలెను.

రామమనోహార లోహియా, అరుణ అసఫాలి; అచ్యుత పట్వర్థన్, మున్నగు సోషలిస్టు నాయకులు ఆగస్టువిప్లవము రోజులలో పార్టీ ఆశయ సిద్ధాంతాలను సువిశదపరచిన, యితర పుస్తకాలుకూడా త్వరలో వెలువడనున్నవి. అన్ని జిల్లాలలోను సోషలిస్టు క్లాస్సులు యేర్పడినచో వాటినుంచే యీ పుస్తకముల పఠించుటకు ప్రయత్నము జరుగును.

ఈ సన్నాహాములో విప్లవ వీరులెల్లరుతోడు పడుదురని నమ్ముచున్నాను.

మీ సోదరుడు,

ముదివర్తి సత్యనారాయణ.



# స్వాతంత్ర్య సమరవీరులకు

## విప్లవాభివందనములు.

సహచరులారా!

శత్రువుతో తలపడిన బ్రహ్మాండ యుద్ధములో పోరాడినమీకును, యుద్ధఖైదీలను ప్రథమమున నా మనః పూర్వక అభివందనముల తెలియచేయుచున్నాను. చిరకాలమునుండి క్రుంగి కృశించిపోవుచున్న మనదేశములో యిట్టి మేటి సుప్రసిద్ధసంఘటన యిదివరకెన్నడు జరుగలేదు. కనీసము జరుగునని ఊహించనైన ఊహించలేదు. నిజమునకు, సాటిలేని మహానాయకుడు మహాత్మాగాంధీ తలపెట్టినట్టి "బహిరంగపోరాటమే" గదా యిది.

ఈ తిరుగుబాటు తాత్కాలికంగా యీ క్షణానికి అణచివేయబడింది. ఇందు సందేహాము లేదు. ఈ క్షణానికి మాత్రమే యిది అణచివేయబడిందని మీరుకూడా నాతో యేకీభవిస్తారని నాకు నమ్మకమున్నది. ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమియులేదు. వాస్తవానికి మనము కొట్టిన ప్రథమదెబ్బే, విజయవంతమై, సామ్రాజ్య ప్రభుత్వాన్ని తుత్తునియలు చేసినట్లైతే, ఆఘట్టము నిక్కవముగా ఆశ్చర్యాన్ని గల్గించియుండేది. తిరుగుబాటు దగ్గర దగ్గర చెత్తరేగునట్లు కొట్టి నడలిపోవునట్లు చేసినదని శత్రువే ఒప్పుకుంటున్నాడు. జాతీయవిప్లవములో ప్రథమఘట్టము

యెంత విజయవంతమైనదీ యీమాట తెలుపుచున్నది గదా.

మరి యేవిధంగా ప్రథమఘట్టం అణచివేయబడింది; అణచివేసింది శత్రువుయొక్క మిలటరీబలమా? లేదా శత్రువు నిర్దాక్షిణ్యముగా అవినీతిపద్ధతి సాగించిన గూండాతనము, దోపిడీవిధానము, దగ్ధవిధానము, హత్యలు, యీ వుద్యోగాన్ని నెరవేర్చినవా? పోలీసులు, తిరుగుబాటు "అణచివేశారని" తలచుట పొరబాటు. విప్లవం పుట్టి చచ్చునట్టిదిగాదు సుమా అని యిన్ని విప్లవముల చరిత్రలు ఉద్ఘోషిస్తున్నవి, పురోగమనానికిది సోపానపు మెట్లు; సాంఘికవ్యవస్థా మార్గగామి. విప్లవము పరిపూర్ణ పరిపక్వముపొందునపుడు కెరటాలకువలెనే ఉచ్చ నీచస్థితులు సహజము. అప్రతిహాతముగా విజయమునుండి విజయానికి కుప్పిగంతులువేస్తూ సాగిపోవు స్థితిలో యిప్పుడు మన విప్లవములేదు. ఉడుకు యిప్పుడు బాగా చల్లారివుంది. సామ్రాజ్యతత్వ దుండగీడునకున్న మిక్కుటమగు అంగ బలము మాత్రము, దీనికి యే మాత్రం కారణంగాదు. దీనికి ముఖ్యంగా రెండుకారణాలున్నవి.

త్రాళ్ళు త్రెంచుకొని విరుచుకుపడ్డ మహత్తర శక్తులను సక్రమ పంథాలో సరియగు మార్గమున నడిపి, క్రమబద్ధమగు దారిచూపుటకు, విప్లవ బలములకు చురుకైన నిర్మాణసంస్థలేకపోవడం ప్రథమకారణం, కాంగ్రెసు మహాసంస్థ అయినను విప్లవమును సాధించుటకు గావల

సిన సమున్నత స్థాయికి యింకను చేరుకోలేదు. పెద్దపెద్ద కాంగ్రెసు వాదులు కూడా తిరుగుబాటు పరిభ్రమణాన్ని గమనింపక పదవీవేశారంటే; నిర్మాణసంస్థ యెంతలోప భూయిష్టంగావుందో తెలిసికోనుడు. తిరుగుబాటు సాగుచున్న చివరదశలోకూడా, అనేక కాంగ్రెసు నిల యాలలో యిది సరిగా కాంగ్రెసు విధానమున కనుగుణ ముగా నడచుచున్నదా లేదా యని తర్జనభర్జనలు సాగుచునేవున్నవి. ఈ సందర్భములోనే యింకా నొచ్చు కోదగ్గ అవివేకతను బైటపెట్టుచున్నాను. చాల పెద్ద పలుకుబడిగల కాంగ్రెసువాదులు కూడా వారి మాన సిక సంకుచితదృష్టిని మార్చుకొని; స్వాతంత్ర్యసాధనకు జరుగు చివర పోరాటఘట్టపు స్థాయియొక్క ప్రాశస్త్యతను గమనించి అనుభవింపలేకపోయారు. మహాత్మాగాంధీ; డాక్టర్ రాజేంద్రప్రసాద్, సర్దార్ పటేల్ ల వంటి ఉత్తమ నాయకులు చూపిన, ఆతురత, తొందర, పట్టుదలల ప్రాముఖ్యాన్ని గుర్తెరిగి అందరు కాంగ్రెసువారి బుర్రలు, హృదయాలు అనుసరింప లేకపోయాయి.

ఇంక రెండో కారణము. ప్రథమసంఘటన విజృం భణానంతరము యే కార్యక్రమాన్ని ప్రజలు నెరవేర్చ వలెనో వారికి తెలుపలేదు. వారివారి ప్రాంతాలలో బ్రిటిషుసామ్రాజ్యాన్ని ఊడ్చిపెట్టినంతనే; తమపైని గల కార్యభారము నెరవేరినదని ప్రజలుతలచారు. తర్వాతచేయ వలసినపని తెలియక యింటిముఖం పెట్టారు, ఇదివాండ్ల

తప్పుగాదు. ఈ తప్పు మనది. రెండో ఘట్టానికి కావలసిన కార్యక్రమాన్ని మనము తెలియజెప్పి యుండవలసినది. ఈ విధిని నిర్వహించకపోవుటచే తిరుగుబాటు సబ్బత చెందినది. ఇంతటితో విప్లవపు టుడుకు చల్లారనారంభించింది తిరోగమనంలో నున్న తిరుగుబాటును, యింకా చిన్నాభిన్నముగా చేయుటకు తగిన బ్రిటిషు సైనికబలములు వచ్చునప్పటికి చాలారోజుల క్రితమే యీ పరిస్థితి యేర్పడింది. రెండవఘట్టంలో ప్రజలముందు పెట్టవలసిన కార్యక్రమరూపము యెల్లావుండవలసినది? దీనికిసరియగు జవాబు అనేకవిప్లవముల గుణపాఠాలే. నిర్మూలనావిధానానికి సంబంధించినంతవరకే విప్లవపు పనిగాదు. విప్లవము పునర్నిర్మాణమునకు ప్రాతిపదికగూడా. భీభత్సంగా నిర్మూలనము సాగించినంతనే విప్లవము విజయవంతము గాదు. విప్లవము గట్టెక్కాలంటే నిర్మూలించిన అధికారాన్ని, పునరాక్రమించడానికి తగు సాధనసంపత్తిని సృష్టించాలి. దాదాపు మొత్తందేశంలో మన విప్లవం నిర్మూలనా కార్యభారాన్ని విజయవంతముగా నేరవేర్చింది. పునర్నిర్మాణ కార్యక్రమానికి పూనుకోమని శంఖాన్ని పూరించింది. పరదేశప్రభుత్వానికి వెనుకా ముందు నిలువ నీడ లేకుండా మాడ్చివేసి, దాని యేజంట్లను తరిమివేయగల్గిన ప్రజలు; వారివారి ప్రాంతాలలో విప్లవాత్మక ప్రభుత్వాన్ని స్థాపించి, స్వంతపోలీసులను, మిలటరీబలములను సృష్టించుకొని యుండవలసినది.

ఇదే గనుక జరిగివుంటే లెక్కకు మిక్కుటమగు వర్ణనా తీతమైన శక్తి ఉద్భవించి వుండేది. విప్లవతరంగాలు పైకి పైకి లేచి ఉచ్చస్థితికి పెరిగిపోవుచు, ఇదే దేశవ్యాపితమైతే — సామ్రాజ్యవాద ప్రభుత్వము తుత్తునియలై పోగానే, ప్రజలు కీలక ప్రభుత్వాన్ని స్వాధీనపరచుకొని, స్వాతంత్ర్యజ్యోతిసి వెలిగించియుండేవారు. అప్పుడు విశాల భారతంలో పునర్నిర్మాణానికి, నిర్మాణ కార్య క్రమం అప్రతిహతంగా సాగేది.

సునిశ్చితమైన నిర్మాణసంస్థ, జాతీయ విప్లవానికి కావలసిన పరిపూర్ణ కార్యక్రమము లేకపోవుట:— ఈ ప్రథమ సంఘటనానంతరం విప్లవం తిరుగుముఖం పెట్టుటకు యివి రెండే కారణాలు.

ప్రస్తుతము మనము చేయవలసిన పనియేమి యను నది యిప్పటి ప్రశ్న. ప్రథమమున ప్రజల మనస్సులలో నుండి నిస్పృహను పారద్రోలి, సంతోషాన్ని కేకెత్తించాలి. ఇప్పుడు మనము యెంతవరకు విజయాన్ని సాధించామో, భవిష్యత్తులో పరిపూర్ణ విజయాన్ని యేవిధంగా సాధించగలమో బోధించి, ఆశ అడియాసగాదని నిరూపించాలి.

ఈ విప్లవ భవితవ్యరూపాన్ని ప్రస్ఫుటంగా మన హృదయాల్లోను, ప్రజల హృదయాల్లోను నిశ్చలంగా ప్రతిబింబింప చేయాలి. ఇది రెండో ముఖ్యవిషయం. ఇది మన స్వాతంత్ర్య సాధనకు చివరపోరాటం. మన గమ్య

స్థానం పరిపూర్ణవిజయం. ఇంక మధ్య మజిలీలు సుతరాం పనికిరావు. "జాతీయ ప్రభుత్వాన్ని" స్థాపించుటకు రాజ గోపాలాచారివంటి సచివోత్తములు చేయు ప్రయత్న ములు వృథా ప్రయాసమాత్రమే గాక, ప్రజల దృష్టిని ముఖ్య సమస్యలనుండి మరలింపజేస్తున్నవి. "క్విట్టిండియా" నినాదానికి "జాతీయ ప్రభుత్వ"నినాదానికి మధ్య సంధి కుదరడానికి అవకాశమే లేదు. "కాంగ్రెసు- లీగుఐక్యత" అను నినాదంతో యెండమావులకు అఱ్ఱులుజాచి పరుగిడు వారివలె ఘోషించువారు, సామ్రాజ్య ప్రభుత్వానికి మద్దతై నిలుచుంటున్నారు. మనలో సంఘీభావము లేక పోవుటే జాతీయప్రభుత్వాన్ని యేర్పాటు చేయకుండు టకు కారణం యేమాత్రమునుగాదు. తానంతట అదే సమసిపోవుటకు సామ్రాజ్యతత్వానికి యిష్టములేదు. ఏమి సందేహం లేకుండా చర్చిల్ యీ విషయాన్ని తేల్చి చెప్పాడు గదా. సామ్రాజ్యాన్ని నీళ్లగల్పుటకు నేను రాజుగారి ప్రధానమంత్రిని గాలేదని మొన్నమొన్ననే గదా యితడు వాక్రుచ్చినది. సామ్రాజ్యతత్వాలు వాటికవే మంటగలసి పోతాయని తలచువాడు సంఘం లోని వెర్రివెంగళప్ప. వినయపూర్వకములైన విజ్ఞాపన లను పెద్ద ఉప్పెనగా లేవదీసి, బ్రిటిషుప్రభుత్వాన్ని ముంచివేద్దామని తలచుచున్న "అఘోరకం విప్లవవాదులు" చరిత్రముందు వారికివారే శుద్ధ అవివేకులుగా నిరూ పించుకో బోవుచున్నారు.

ఈ రోజులలో సామ్రాజ్య పెనుభూతాన్ని తల దన్నుటకు భారత దేశములోని వివిధ శాఖల సమీకరణ కన్న, సకల జాతీయవిప్లవశక్తులకూటమి ముఖ్యావసరం. సరే, యీ విప్లవ శక్తులన్ని కాంగ్రెసుజండా క్రింద యేకీభవించియున్నవి. కాంగ్రెసు – లీగు ఐక్యత అని బాకాలూదుట యీ విప్లవ శక్తుల కప్పివేయలేదు. నామమాత్రమగు సంబంధములో తంటా తెచ్చిపెట్ట గలవు. విప్లవము,స్వాతంత్ర్యముల సాధనకు నడువవలసిన బాటన కలసివచ్చుటకు లీగు యెప్పుడు విముఖమగుటయే దీనికి కారణం.

సామ్రాజ్యతత్వాన్ని కూకటి వ్రేళ్లతో పెకలించి వేయుటే మన గమ్యస్థానం. ఇది మన దృక్పథంలో అచంచలంగా నిలచిపోవాలి. ఈ విషయంలో రాజీబేరాలు పనికిరావు. గెలుపో వోటమో తేలిపోవాలి. మనకు ఓటమి అసంభవం. అహోరాత్రిళ్ళు విజయసాధనకు మనము సాగించు కృషికి చేదోడుగా, బలవత్తరమగు ప్రపంచ శకులు; యింపీరియలిజము: ఫాసిజముల, హతమార్చుటకు పైకి పైకి కమ్ముకొని వస్తున్నాయి. శాంతి సమావేశాలలో తలలన్ని బ్రద్దలుకొట్టుకొని సాధించు కృత్రిమపు తాత్కాలిక ఫలితములు. యుద్ధానంతర ప్రపంచపు భావిస్వరూపాన్ని నిర్ణయించగలవని సమ్మరాదు. యుద్ధం ఒక వింతస్వరూపి. దీనిలో కాచి వడబోసినట్లు అనేక నూతనశక్తులు

బలములు, ప్రబలమగుచున్నవి. విజయుడు, అపజయుడు అను భేదములేకుండా యుద్ధమెత్తులను యే జీణాన్ని చీల్చి చెండాడు తవి. ఆసియా యూరపు ఖండాలలోని, రష్యా, జర్మని, ఆస్ట్రియా, ఆటమాన్ (టర్కీ) సామ్రాజ్యాలు బూడిదకలసి పోతవసి గత యుద్ధానంతరము యే శాంతిసమావేశము నిర్ణయించి యుండలేదు. రష్యా, జర్మనీ, ఆస్ట్రియా టర్కీ విప్లవాలు లాయిడ్ జార్జి; క్లామెనస్కు, విల్సన్ ప్రభువులలో యెవ్వరి అనుమతి పొందకుండగనే చెలరేగినవి.

ప్రపంచములో మానవులు, సమరము సల్పుచు, విగతజీవులగుచు,పలుబాధలకు గురియగుచున్న ప్రతిచోట కూడా ఒక అద్భుతశక్తి పనిచేస్తూనే వున్నది. ఈ అద్భుతశక్తే, భారత సాంఘిక వ్యవస్థలోకూడా ఒక అద్భుతచైతన్యాన్ని కదల్చివేసింది. చర్చిలులు రూజువెల్టులు గానీ, హిట్లరులు టోజోలుగాని, ఈ యుద్ధానంతరం ప్రపంచభావిని శాసించలేరు. ఈ చరిత్రాత్మక కార్యాన్ని మనము ప్రాతినిధ్యము వహిస్తున్న మహత్తరశక్తులే నెరవేర్చగలవు. విప్లవశక్తులు ప్రతిచోట కదం త్రొక్కుచున్నసంగతి సందేహాస్పదమా ? ఇదమిద్ధమని భవిష్యత్తు తెలియక కోటానుకోట్ల ప్రజలు కిక్కురుమనకుండా దుర్భరకష్టాలకు గురియగుచున్నారంటే మనం నమ్మగలమా ? పరిపాలకులు గూడుపుఠాణీ చేయుచు, అబద్ధాలతో కప్పివుస్తుంటే కోట్లకొలది ప్రజలు సంతృప్తి

చెందిరను విషయం మనం నమ్మగలమా ? కాదు. ఆ విధంగా యెన్నడు జరగదు.

కాబట్టి మన గమ్యస్థానము పరిపూర్ణ విజయముగా పెట్టుకొని తోట్రుపాటుతో వెనుకాముందు చూడక ముందుకు సాగిపోవాలి. ఖచ్చితంగా మనం నెరవేర్చ వలసిన విధియేమిటి ? ఒక యుద్ధంలో విజయం పొందినట్టి గాని, అపజయం పొందినట్టిగానీ సైన్యాధిపతి యేమి చేస్తాడు ? బలాన్ని సమీకరించుకొని రెండో రంగానికి తయారౌతాడు. ఎల్ ఆలమీన్ వద్ద అద్భుతమగు విజయము పొందిన రోమెల్ సమీకరణకు, నష్టదతకు విరామము కొరకై ఆగెను. అలెగ్జాండరుగూడా యిట్లే తయారై, తన ఘోరపరాజయాన్ని గొప్ప విజయంగామార్చాడు. మనది చివరకు అపజయంకూడాకాదు. విశాలమగు మన దేశభూ భాగంలో ప్రథమఘట్టమున మనం కృతకృత్యులమగుట మూలంగా బ్రిటిషుదురాక్రమణదారుడు సివిలుపాలనలో తల్లక్రిందు లైనాడు. బ్రిటిషు సామ్రాజ్యము పేరుతో మన పై మొత్తిన యీపోలీసు. మాజస్ట్రేటు. అధికారాలు, న్యాయస్థానాలు, చెరసాలలు సంఘటితబలానికి యెదురై నిలుచున్నచో, అతుకులబొంత లేనని, అనుభవపూరితంగా యిప్పుడు ప్రజలు నేర్చుకొన్నారు. ఈ పాఠాన్ని మరచి పోవడానికి యెట్టి అవకాశం లేదు. ఇదే తర్వాత పురోగమ నానికి పునాదిగా తయారౌతుంది.

ఇప్పుడు యీ పరిస్థితులలో, రానున్న పురోగమనానికి, తయారుకావడం మన ముఖ్యతమ

మైన మూడవకార్యసాధన. కాన, మన పెదవులు యిప్పుడు ఉచ్చరించవలసిన మాటలు "ఆర్గనై జేషను; డిసిప్లిను"

తర్వాత పురోగమనమా? తర్వాతపురోగమనానికి యెప్పుడు అడుగువేయ తలపెట్టాలి: రానున్న అయిదారు సంవత్సరములలో ప్రజలు ముందుకురారని కొందరుతలుస్తున్నారు. శాంతిసమయంలో యీ అంచనా నిజం కావచ్చునుగాని, యుద్ధంవల్ల భీభత్సమై-చిందరవందరైన ప్రపంచంలో పరిస్థితులు అనుక్షణము తారుమారగుచున్న యీకాలంలో యిది సబబుగాదు. పశుతుల్యమైన బ్రిటిషుపాసిస్టు రాక్షసకృత్యం - లిల్లిత్గోలు, హాత్యలు, స్టీవరులు యింకావీరితొత్తులు; యీవర్గానికే చెందిన భారతదేశగులాములు-యీక్షణానికి ప్రజలను తలలువంచేటట్లు చేయవచ్చునుగాని, దోపిడీగాండ్రకు స్నేహితులుగా మార్చడానికి మాత్రం యేమాత్రం వీలుగాక పోయింది. నాజీనరకరూపానికి ప్రతిరూపమగు యీ బ్రిటిషు కృత్యానికి దేశం నలుమూలలా అసమ్మతి, క్రోధం, పాకిపోయి, కసితీర్చుకున్నగాని యీదావాగ్ని అణగదని కంపింపజేస్తున్నవి. మరల ధైర్యాన్ని పురస్కరించుకోడానికి, - బలవత్తరమగు సర్వసన్నాహాలు సాగుచున్నాయని, డిసిప్లినుకు లోబడిన ఐక్యత కార్యాచరణకు ఉద్భృతంగా పూనుకొని, యీపథకాలు, స్కీములను యీసారి పురోగమనానికి ఆచరణలో పెట్టాలని ప్రజలు అర్థంచేసుకుంటేచాలు- రెండవముట్టడికి అమిత సుముఖత యేర్పడి

నట్లే. అంతర్జాతీయపరిస్థితులు మనకు అండమై నిలువ వచ్చును. అటుతర్వాత యీ సందిగ్ధఘట్టంలో - విస్తు పోకుండా, చంచలులం కాకుండా, విశ్రాంతితలచకుండా, కొరడాతో కొట్టినట్లు యెప్పుడు యేక్షణంలో గాంధీజీ నిర్యాణంవరకు నిరసనవ్రతం వచ్చిపడుతుందో అనే భయం అప్రమత్తులం కాకుండా కాపాడుతుంది.

రెండవఘట్టపు పురోగమన సమస్య విప్లవ పురోగమన కార్యక్రమానికి జతమైయున్నది:-విప్లవాత్మక ప్రభుత్వాన్ని యీనిట్లగా స్థాపించుట, హింసా, సాయుధ సైన్యనిర్వహణము, యీచివర ప్రశ్నపైననే ఆధారపడివుంది. కాన యీ ప్రశ్నకు సంబంధించినంత వరకు నా దృక్పథాన్ని మీముందు పెడతాను. నాకు తోచినంతవరకు మన విప్లవముయొక్క భావిని యిది బాగా నిర్ణయిస్తుంది. ఈ జరిగిన విప్లవనిర్వహణంలో హింసాకాండ చెలరేగిందని, బ్రిటిషు అధికారులు నొంతులుచించుకొని యేకరువుపెట్టడానికి, సమాధానం గాకొద్దిమాటలు జెప్పుట నా ప్రథమ కర్తవ్యమని నేను భావిస్తున్నాను. దుర్భరమైన ముల్లుపోట్లమూలంగా, వ్యక్తిగత, సమష్టి అహింసా కార్యనిర్వహణంలోకూడా కొంత హింసాకాండసాగింది. దీన్ని యీ కార్యనిర్వహణ వుధృత వురవడికి పోల్చిచూస్తే, చాల స్వల్పం. వేలాది పరదేశప్రభుత్వపు బ్రిటిషు, యిండియను అధికారులు యే ఆధారమూ లేక - చాలారోజులవరకు - ప్రజల చేతులలో చిక్కి వారి దయాదాక్షిణ్యాలకు గురిమై ఆస్థి

ప్రాణాలను దక్కించుకొన్నది వీరు బహుశా గమనించి నట్లు లేదు. ఇది యిట్లు వుండనిండు, నిర్మలమైన త్యాగ మూలమైన శౌర్యముతో - చిన్న పెద్ద, స్త్రీ పురుషుడు అను భేదంలేకుండా వేలాదివేల ప్రజలు, చేతులలో విప్లవ చిహ్నా మరి జాతీయపతాకాన్ని పట్టుకొని, "యింక్విలాబ్ జిందాబాద్" అని పెదవులు ఉచ్చరిస్తూనే శత్రువుతుపాకిగుండ్లకు గురియై నేలకూలిరే... వారి సంగతేమిటి? ఈసాధుపుంగవుల శౌర్యాన్నిగూర్చిచివరకు ఒక్కమారైనా యీ బ్రిటిషువారు చెప్పగల్గిరా?

హింసలోబుట్టి, హింసపై ఆధారపడి, హింసయే అండగా పెరుగుచున్న బ్రిటిషుప్రభుత్వం, ప్రతిదినము వికృతరూపములగు హింసాఘట్టముల సాగిస్తూ, కోటాను కోట్ల ప్రజల నమిలివేస్తూ, వారి జీవితరక్తాన్నే పీల్చి వేస్తున్న వీరు...యితరులుజేసిన హింసను గూర్చి, యింత గందరగోళం చేయడం శోచనీయంగానే వుంది. మీరు యే ఆయుధాలతో మమ్ము ప్రతిఘటిస్తున్నారని బ్రిటిషువారు యెట్లు ప్రశ్నింపగలరు? తిరుగుబాటు దార్లు అహింసకు కట్టుబడితే, వారును అట్లే పోరాడు తామని పూచీ యివ్వగలరా? వేలాది అహింసావాది సైని కులను వీరు తుపాకిగుండ్లకు ఆహుతి చేసియుండలేదా? ఏ ఆయుధములను మనము వుపయోగించినను బ్రిటిషు వారు తుపాకిగుండ్లను, దోపిడీలను, బందిపోట్లను; దగ్ధవిధానమును మాత్రమే ప్రతిగా వుపయోగిస్తారు. కాబట్టి యేవిధముగా పోరాటము సాగిస్తున్నారనుసంగతి

వీరికి సంబంధించి నదిగాదు. ఈ సమస్యను పరిష్కరించుకొనుట మన కర్తవ్యం మాత్రమే.

ఇంక యీ ప్రశ్న యేవిధంగా మనకు సంబంధించి వుందో గమనిద్దాం. అహింసా నిర్వాహణ దృక్పథంలో గాంధీజీకిని - వర్కింగుకమిటి, అఖిలభారతకాంగ్రెసు సంస్థలకు మధ్యనేచాలా భేదంవుంది. ఏసందర్భములో కూడా గాంధీజీ అహింసా విధానంనుండి ఒక అడుగు జవ దాటడు. అది ఆయనజీవితపు సిద్ధాంతము, ఆశయము కూడాను. కాంగ్రెసుకుమాత్రం అట్లుగాదు. ఈ యుద్ధ కాలంలో స్వేచ్ఛవచ్చినగాని, చివరకు జాతీయప్రభుత్వం స్థాపించినగాని, ఆయుధాలుచేపట్టి దురాక్రమణదారుని ప్రతిఘటిస్తామని పదేపదే కాంగ్రెసు నొక్కిచెప్పింది. జర్మనీ, జపానులపై యుద్ధానికి ఆయుధాలను చేదాల్చ డానికి మనం తయారైనప్పుడు, యీమార్గంలోనే బ్రిటిషువారితో పోరాడుటకు యెందుకు వెనుకాడు చున్నాము ? అధికారంలోవున్న కాంగ్రెసుకు సైన్యం వుంటుంది; అరణ్యంలో వున్న కాంగ్రెసుకు అది సాధ్యం కాదు అని చెప్పడమే దీనికి సరియైన జవాబు. విప్లవాత్మక సైన్యం తయారౌదనుకొనుము. లేదా యిండియను దళములుగాని, వీటిలో కొంతభాగంగాని తిరుగబడిం దనుకొనుము, సైన్యాన్ని తిరుగబడమని, తిరుగబడ్డ సైన్యాన్ని ఆయుధాలువిసర్జించి, నిరాయుధంగా బ్రిటిషు తుపాకిగుండ్లకు గుండెనర్పించమనడం, తెలివైన పనేనా ?

కాంగ్రెసు ఉపసంహరించుకొన్న—గాంధీజీది కాదుసుమా—నా నిర్వచనం ఖచ్చితమైనది. ప్రస్ఫుటమైనది. దేశము స్వాతంత్ర్యప్రదమైనచో, హింసామూలంగానే దురాక్రమణదారుని యెదిరించ కాంగ్రెసు సంసిద్ధమైనది. ఇంక చూడండి, మనలను మనం స్వాతంత్ర్యులనుగా నిర్ధారణ చేసుకున్నాము. బ్రిటనును దురాక్రమణదారుడుగా నిర్ణయించివేశాం. అయినప్పుడు బొంబేతీర్మానం ప్రకారము, బ్రిటనుతో సాయుధబలముగా తలపడుట, న్యాయసమ్మతమే. ఇది గాంధీజీ సిద్ధాంతాలతో సరితూగకపోతే అది నాతప్పుగాదు. వర్కింగుకమిటి, అఖిలభారత కాంగ్రెసుకమిటీలే, గాంధీజీతో విడబడి, యుద్ధానికి ఆయనయిచ్చిన అహింసా నిర్వచనాన్ని తృణీకరించినవి. పోనీ యీ తీర్మానానికి ఒకరూపం, ఆకారం యేర్పడడానికి బ్రిటిషుప్రభుత్వం గాంధీజీకి తావిచ్చిందా అంటే, అదీలేదు. కాబట్టి యీ క్రింది మన నిర్వచనం ప్రకారం గాంధీజీని తృణీకరించినట్లు యేమాత్రంగాదు. మన నిర్వచనప్రకారం మనబాధ్యతనుమాత్రమే మనము నెరవేరుస్తున్నాము. నాకు సంబంధించినంతవరకు, నిజాయితీ యగు నిక్కచ్చి కాంగ్రెసువాదిగానే, బ్రిటనును సాయుధంగా యెదుర్కొంటున్నాను. ఇది న్యాయసమ్మతం. అల్లిబిల్లిగా నా సామ్యవాదాన్ని యీ సమస్యపై అల్లివేయుటలేదు.

అహింసావిధాన వీరధనుల మాదిరి, దీనిని విశాల రంగంలో బహుసంఖ్యాకంగా ఆచరణలో పెట్టినట్లైన

హింసావిధానము పట్టి అనవసరమని నేను గట్టిగా బల్ల గ్రుద్ది చెప్పగలను. ఇట్టి అహింసావిధానం అలభ్యమై, శాస్త్రనిర్వచనములతో మసిబూసి మారేడుకాయ జేయుచు, విప్లవపరిణామమును అడ్డి, అపజయము పాలు చేయు పిరికివంతమగు దొంగవేషాలకుమాత్రం నేను కాపీయను.

విప్లవముయొక్క చివరఘట్టవిర్మాణ నిర్వాహణ విధానాన్ని ఆచరణలో పెట్టుట మనహృదయాలలోనుంచు కొని, దీనికిగాను మనము సన్నద్ధమై మనబలాలను నిర్మించుకొని, క్రమశిక్షణ, డిసిప్లిను నేర్పి, తయారుచేయ వలెను. మనము చేయు ప్రతిపనిలోను, యిది ఒక చిన్న కుట్రగాదను సంగతి, మన హృదయనాళములలో స్ఫురించుచూ వుండాలి. ప్రజాబలపు మొత్తవు తిరుగు బాటే మన ముఖ్యాశయము. కాన మనముచేయు అభేద్యమైన టెక్నికలు పనితోపాటు, చాలా ఘట్టిగా ప్రజలలో పనిచేయువలసి యున్నది— ప్రజలంటే పల్లెల లోని పాటకజనం, ఫ్యాక్టరీలు, గనులు, రైల్వేలు, తది తరములలోని కార్మికులు అని యిక్కడ అర్థం. వీరిమధ్య నిరంతరమగు ప్రచారముచేయవలెను, వారి కష్టా లలో తోడ్పడవలెను. ప్రస్తుత కోర్కెలకై పోరాటము సాగించుటకు ఆర్గనైజు చేయవలెను. వీరిలోనుండి యేరిన నిక్కచ్చియగు సైనికులను చేర్చుకొని, టెక్నికలుగాను, రాజకీయముగాను, తర్ఫీమునిచ్చి, మన వివిధ కార్యకలాప ములలో ఉపయోగపడునట్లు చూచుకోవలెను. తర్ఫీదే

యిచ్చినచో, వేలాదివేలు సాధింపజాలనిపనిని, అల్ప సంఖ్యాకులే సాధించగలరు ప్రతి ఫిర్మా, తాలూకా, కాణాలలోను, చెప్పుకోదగిన ప్రతిఫ్యాక్టరీ, వర్క్‌-షాపుల లోను, మనకు ఒక సైనికబృందముండవలెను. వీరికి మానసికంగాను, సాధనసంపత్తి మూలంగాను నిందు బందోబస్తు నీయవలెను.

అప్పుడు భారతసైన్యములోను, సర్వీసులలోను పనిజేయుట మిగిలివుంటుంది. ఆందోళనప్రదర్శనములు కూడా ముఖ్యం. పాఠశాలలలోను, కళాశాలలలోను, బజారులలోను గూడా మనం పనిచెయ్యాలి. సంస్థానాలు, సరిహద్దులలో కార్యాచరణకు పూనుకోవాలి. ఈ సందర్భంలో యిక్కడ మనము తయారుజేయవలసిన సమస్తపథకాన్ని చిత్రించుట నాకు సాధ్యంగానిపని. బహు ముఖముల మనము చేయవలసిన కార్యక్రమము ప్రబలమైనదిగాన, యిందు మన ప్రతి ఒక్కనికికూడా పనివుందనిమాత్రం చెప్పి యీ విషయం ముగిస్తాను. ఇప్పటికే మనం చాలా పనిచేశాం. కాని యింకా చాలా యెక్కువ పని అక్లేసిలచివుంది.

యువకులు గాక యింక యెవరు దీనినంతా నిర్వహింపగలరు?మన విద్యార్థులు,అత్యద్భుత చరిత్రభారాన్ని నిర్వహించారు, ఈ సాధించినమార్గాన్నే ముందుకు సాగిపోయి,వారు మనకిచ్చిన మాటను నిలబెట్టుకోగలరని ఆశించడం, అతియాశ అనగలరా? ఈప్రశ్నకు విద్యార్థులు మాత్రమే జవాబివ్వాలి.

సర్వసన్నద్ధం గావడమంటే,-ప్రస్తుతానికి పోరాటాన్ని ఆపివేయాలనేభావం పొడమగూడదని నేను నిర్దుష్టంగా చెప్పదలచుకున్నాను. ఈ భావం యేమాత్రం కూడదు "చిల్లరపోరాటాలు" "సరిహద్దు కార్యకలాపం" "చిల్లర ప్రతిఘటన" "చాటుమాటు ముట్టడులు" "పహారా" యీ పని అంతా జరగవలసిందే. ఈపనులు కొనసాగిస్తూ వుండడంలోనే మున్ముందు ప్రతిఘటనకు తయారుకావడం యిమిడివుంది.

ప్రజలలో గాఢసమ్మకముండాలి. ఆశయానికి అంకితం గావాలి. తర్వాత ముందుకు సాగిపోవాలి. మనం వేసే ప్రతిఅడుగు దృఢంగావుండాలి. మనహృదయాలు ప్రస్ఫుటమై వుండాలి. మనదృక్పథం చెక్కుచెదరకూడదు. అప్పుడె ఆకాశంలో భారతదేశపు స్వాతంత్రభానుడు అరుణకిరణాలతో వుదయించాడు. అనుమానాలు; తగాదాలు సోమరితనం అవిశ్వాసములనే కారుమేఘాలు యీ బింబాన్ని కప్పివేయకుండా చూడాలి. అట్లేజరుగనిచ్చినచో స్వకల్పిత అంధకారంలో మనము మునిగిపోతాం.

సహచరులారా, నాభావాలను మీముందుంచుటకు మరల ఒకసారి అవకాశం దొరికినందులకు నేను అత్యంత ఆనందంపొందుచున్నాను. ఇది నాకు పటుత్వాన్ని యిస్తున్నది. మన బాధ్యతలను చెప్పునపుడు; మన నాయకుడు ఉపదేశించిన "కరెంగే యా మరేంగే"

యను సందేశం నామార్గగామిగా భావిస్తున్నాను. మీ సంఘీభావమే నాబలం; మీ ఆజ్ఞలు నాకు ఉత్సాహము.

యిండియాలో యెక్కడనో }
డిశంబరు, 1942 } జయప్రకాశ నారాయణ.

---

# స్వాతంత్ర్య సమర వీరులకు

## రెండవ లేఖ

సహచరులారా,

[నెలల క్రితం శత్రువు కారాగారంలో నుండి తప్పించుకోగానే జాతీయవిప్లవమునుగూర్చిన నా అభిప్రాయాలను తెలిపి, కొన్ని మార్గాంతరాలను సూచించుటకు నాకు చక్కని అవకాశందొరికింది. అప్పటికి యిప్పటికి అప్పుడే ఆరునెలలు గడచిపోయినవి. వింత వింత ప్రవాహాలు వీధులవెంట పారిపోయినవి. కాబట్టి గతించిన నెలల వర్యాలోకించి ప్రస్తుతం మనపోరాటమున్న ఘట్టాన్ని పరీక్షించడం ఫలప్రదమైన విషయం.]

## (1)

గత అర్థసంవత్సరమునుండి, విప్లవము అభివృద్ధితో సన్నిహిత సంబంధముండుట మూలంగా, ప్రప్రథమంలోనే, నే నేర్పరచు కొన్న వ్యూహాలను మార్చుకో

డానికి యేకారణం కనుపించలేదు. నా ప్రధమ లేఖలో యిచ్చిన నిర్వచనాలలో చేయవలసిన మార్పులుకూడా యేమీ కనుపించుటలేదు. ఒకవిషయంలో మాత్రం మార్పుఅవసరం—అంత ముఖ్యతమమైనది కాకున్నా— ముఖ్యమైందిమాత్రం.

గత డిశంబరులో కొద్ది నెలలలోనే మరలయింకో ప్రజాతిరుగుబాటువచ్చి తీరుతుందని నేను బాగా భావించాను ఆ తిరుగుబాటు యివ్వాళవరకు సాధ్యం కాలేదు. పైగా అద్యతభావిలో అది సాధ్యముకాదని మనముఒప్పుకొని తీరాలి. ఈవాస్తవమైన సంగతి, ప్రస్తుత మనపోరాట పంధాలోను, విధానంలోనూ,యెట్టి పరిణామమును తెచ్చి పెడుతుందనే ప్రశ్న సాధారణంగా ఉత్పన్నమయ్యేదే. ఈ ప్రశ్నకు సమధానం చెప్పడానికి ముందు ప్రజలు మరల తిరుగుబాటుకు యెందుకు విముఖులైనారో కొంచెం లోతుకుదిగి ఆలోచించాలి.

ప్రజల పటుత్వం త్రొక్కి వేయబడిందనిగాని, పోరాటపుశక్తి ఫుడిగిపోయిందనిగాని యీనిర్వచనాల మూలంగా తలచుట పొరబాటని నొక్కి చెప్పుచున్నాను. నేడు బ్రిటిషుప్రభుత్వాన్ని ద్వేషిస్తున్న స్థాయిలో యిది వరకెన్నడు ప్రజలు ద్వేషించియుండలేదు. అట్లే దీన్ని తుదముట్టించాలనికూడాకృతనిశ్చయులై యున్నారు. నిజానికి కొంత పిరికితనం యిప్పుడు యేర్పడివుంది. ఇది అత్యధిక భాగం (పూర్తిగా అని చెప్పను) పట్టణాలలోను, భాగ్యవంతులలోను కనుపించుచున్నది. వాడవాడలలోనే

గదా నిర్దాక్షిణ్య కృత్యాలు విపరీతంగా తాండవించినది. కాని. వీరిలోని ప్రతిభ అణగారిపోవుటకుమారు, దెబ్బకు దెబ్బకొట్టి కసిదీర్చుకోవాలని వీరి హృదయనాళాలలోని శౌర్యాన్ని ఉద్దీపింప జేస్తున్నది, సరియగు సదవకాశం లభించగానే చండప్రచండగా చెలరేగి, బ్రిటిషు ప్రభుత్వాన్ని తుత్తునియలు చేసివేస్తుంది. ఇంతవఱకును బ్రిటిషు గూండాతనమును చవిజూడని మారుమూలల పల్లెలలోనే కొంతభయోత్పాదమునకు తావు కనుపించుచున్నది. తలతాకట్టుపెట్టియైనా తప్పించుకుందామనే ధోరణిలోవీరున్నారు. కాని వెన్నంటి వాస్తవ పరిస్థితులను బోధించినపుడు వారితోటి సహచరులతోపాటు రొమ్మువిరచి, తప్పక కలసిమెలసి వస్తారని నావిశ్వాసం. ప్రథమఘట్టంలో ప్రముఖపాత్రనిర్వహించిన విద్యార్థులు, మరల తిరిగి పాఠశాలలకు, కళాశాలలకు వెళ్ళారు. ఆహారపరిస్థితి అధ్వాన్నమైపోయింది. బ్రతుకుటకే కష్టాలు బ్రహ్మాండమైనవి. రోజు రోజునకు దిగజారిపోతున్న వేతనాలు యుద్ధ ప్రయత్నాలపై కార్మికులకు యేహ్యత పుట్టించుచున్నవి. దీన్నంతా అవగాహనచేసుకుంటే యింకోబహిరంగ పోరాటమే సాగితే - ఆగస్టు - సెప్టెంబరులలోని పృథ్వి తాసికన్నా యెన్నోరెట్లు యెక్కువగా కార్మికులు త్యాగాలు చేస్తారు. పోలీసుబలాలలోని క్రిందితరగతులకు యీపీడిత ప్రభుత్వంపై 1942 లో కన్నను యింకా యెక్కువగా ద్వేషము బలసిపోయింది. ప్రస్తుతం వీరిని అజమాయిషీలో నుంచగలిగినను, ఈసారి తిరుగుబాటులో

మొత్తమునకు మొత్తము యెదురుతిరుగుతారు. భారత సైనికదళములలోని ఉద్యోగులలోను, సైనికులలోను, యుద్ధం సాగుకొలది ద్వేషము తగ్గుటకుమారు పెరుగు చున్నది. క్రొత్త సైన్యాధిపతి, జీతాలవిషయంలో ప్రవేశ పెట్టిన కొత్తనమూనాలుకూడా వీరిని కూడగట్టుక వచ్చునట్లు లేదు.

ఈ పరిస్థితులన్నీ నిజమయితే, తిరుగుబాటు యెందుకు ప్రారంభంకాలేదు; కనీసం కనుచూపు మేరలో యీ ఆశలు యెందుకు కనుపించుటలేదని ప్రశ్నించుటకు అవకాశమున్నది. సులభసాధ్యంగాని సాత్విక ప్రవృత్తే దీనికికారణమని నాబుర్రకు తట్టుచున్నది. నాయకత్వందీనికంతకు కారణాలు విప్పిచెప్పవలసియున్నా యీసూత్రాలన్ని విప్పిచెప్పి అవగాహన చేయుటకు అతీతమైనవి. పీడితప్రభుత్వపు పసలయిపోయింది; చివరమెట్టునమాత్రం నిలచివుంది అనే అభిప్రాయం ప్రజల మనస్సులలో నాటుకపోవాలి. ఇది ప్రముఖ పరిణామానికిముఖ్యకారణములలోఒకటి. ఆగస్టుదరిదాపునెలలో ప్రపంచయుద్ధ పరిస్థితులు భారతీయప్రజలలో అట్టి అభిప్రాయాన్ని కలిగించినవి. బ్రిటిషుసామ్రాజ్యము ఊగిసలాడుచున్నది - ఒకేదెబ్బ అంతే - యింకచాలు; తమాం నేలగూలి పోతుందని విశ్వసించారు. ప్రస్తుతం గత కొద్ది రోజులనుండి యీమనఃప్రవృత్తి బొత్తుగామాయమై పోయింది. కనీసం కలవరపెట్టుటకుమారు, నీరసానికే దోహద మిచ్చిందని అయినాఅనవచ్చును. చీలి పడిపోయిన

ముక్కల కూడగట్టి, బ్రిటిషుసామ్రాజ్యాన్ని నిలబెట్టుటకే అమెరికా ప్రభుత్వము అవతరించిందని ప్రతిరకము నమ్ముచున్నది. వాస్తవము గమనించినచో కృంగిపోయిన ప్రభుత్వం కూలిపోవడానికే క్రమేపి పరిస్థితులు సానుకూలమగుచున్నవి. అమెరికా వారుకూడా యీకార్యాకలాపానికి వారిచేయికూడా అందిస్తున్నారంటే ఆశ్చర్యకరముగా వుండవచ్చును. గమనించండి "కాపాడిన" దేశాలను ప్రధమతాకట్టు పెట్టుకోటానికి అమెరికా వెనుకాడుతుందంటారా? స్థూలదృష్టికి యీపరిణామము కనుపించదు. కాబట్టే ప్రజల మనస్సులలో స్తబ్ధత ఏర్పడింది.

ఈ స్తబ్ధత చెదిరిపోడానికి రెండే రెండు పరిస్థితులూ యేర్పడాలి. అంతర్జాతీయపరిస్థితులు బాగుపడనన్నా బాగుపడాలి; అంటే, బ్రిటిషుసామ్రాజ్యానికి గుండె పట్టుకోవాలి. ఇది కాదనుము. దిమ్మ తిరిగేటట్లు విసుగు విరామంలేకుండా శత్రువుపై దెబ్బగొట్టగల నిర్మాణయుత విప్లవ బలములైనా వుండాలి. అప్పుడు ఒక మహత్తర సైన్యమున్నను తిరుగబడిన భారతదేశపు ఉద్రేకపు ఉప్పెనను బ్రిటిషువారు అరికట్టజాలరని ప్రజలలో గాఢతర విశ్వాసమేర్పడుతుంది. అంతటితో తిరుగుబాటుకు ఒక ప్రతిభావంతమైన నాయకత్వమున్నదనీ, విజయము తప్పదనీ ఆశయేర్పడుతుంది.

గత ఆగస్టులో యుద్ధమొక్కటేగాదు; అట్టి విచిత్రమైన మనఃప్రవృత్తిని కల్పించినది. నిండు బలంతో కాంగ్రెసు అండమై నిలుచోని వుందని, ప్రజల ప్రాతినిధ్యం

వహించిందనేది కూడా. యీ నదవకాశానికి దారితీసింది కాన, ప్రజలకు నాయకులలో నిండు విశ్వాసముండడం, వారు పిలువగానే నిండు ఉత్సాహంతో గాఢతరనమ్మకంతో ముందుకుదూకడం సహజమేకదా. ఇప్పుడు యీ నాయకులేమో చెరసాలలో బంధింపబడ్డారు. ఇంతటితో సరి. ప్రజలు తలదాచుకొనుచోటులేక వెరగంది పోయారు. ఇట్లు తిరుగుబాటుకు ప్రజలలో సరియగు మానసిక ప్రవృత్తి గల్పించిన రెండవసదవకాశంకూడా దిగనాసరిల్లి పోయింది.

ప్రథమకారణాన్ని కల్పించగల శక్తి మనచేతులలో లేదు. కాని రెండవకారణానికి సంబంధించినంత వరకు పరిస్థితులమార్చడానికి మనకు శక్తిగలదు. ఇది మన విధి ప్రజలలో చలనం లేదు, తిరుగుజవాబు అడుగంటినది అని బలహీనమైన సాకులు జెప్పాచు, వెనుకకు జారడం పోరాటవీరులలో పరిపాటి అయిపోయింది. ఇది దుర్బలత్వం పరాజయ చిహ్నం. వారిలో కదలికగల్గించగల శక్తి ఉద్భవించనంతవరకు ప్రజలలో చలనముండదు. మన నిర్మాణసంస్థ ప్రవర్థమానమై, కట్టుదిట్టమై నిండు బలాన్ని సంపాదించుకొని, ప్రజలకు గట్టినమ్మకం కల్గించలేనంతవరకు వారినుండి మనకు జవాబురాదు. వారు మనల ననుసరించనూ అనుసరించరు. వారు చేయవలసిన విధిని ప్రజలు ఒకసారి చేసేశారు. ఇప్పుడు మననుండే జవాబు రావలసి నిలచివుంది. మనం మనవిధిని నెరవేర్చినట్లైతే తిరిగి వారి విధిని వారు నెరవేర్చుటకు వెనుదీయరు.

ఆగస్టు రోజులలో, మహాత్మాగాంధీనాయకత్వము, నిండు కాంగ్రెసుబలసమ్మేళనము ప్రజలముందు కన్నులకుకట్టి నట్లు కనుపించుచున్నది. నేడు వారు యేకాకులుగా వదలి వేయబడ్డారని తెలిసినపుడు, దేశంలో నడుమువంచకుండా పోరాటాన్ని సాగించగల నిర్మాణయుత బలములు లేవని తేలిపోయినపుడు, వారిలో నిస్పృహయేర్పడి, మనకర్మము మనదని తలచడం సహజమైన లక్షణం.

కాబట్టి ప్రస్తుత వాతావరణం - స్వాతంత్ర్య పిపాసతో, విప్లవములో చేరి అప్రతిహతముగా ముందుకు సాగిపోవు సైనికులకు చాలా సరియగువాతావరణం, వారి నిర్మాణసంస్థను బలపరచుకొని, శత్రువుకు విధి విరామ మివ్వకుండా పోరాటం సాగించాలి. ఎంతటి త్యాగమైనను, ఎంత బాధలనైనను, గొప్పవని లెక్కవేయ డానికివీల్లేదు. వాగ్వివాదాలుగాని, ప్రేరేపణలుగాని, నిరర్థకపు లాలనలుగాని మనలను పెడత్రోవకుత్రిప్పనివ్వరాదు. పోరాటములోని ప్రతిభాగము మనకు బాహాటమే. మన ఆశయ సిద్ధాంతాలు యెట్టివైనను కానిండు, మనయెత్తులు ఆయుధాలలో భేదముండనిండు. మనదారిమటుకు సువిదితమే నిరాఘాటంగా మనం పోరాటం సాగిస్తూ వుండాలి, ఒకే సంవత్సరము మన పోరాటము సాగనిండు. లేదా పది సంవత్సరములు పట్టనిండు, ఇది మనలో యెట్టి భేదము తెచ్చిపెట్టరాదు. అమెరికావారు, వారి స్వాతంత్ర్య పోరాటాన్ని యేడేండ్లు సాగించారు. చైనాయుద్ధం ఆరేండ్లుగడచి యేడోసాలులో పడినాకూడా యింకను

అంతుతేలలేదు. ఇంతాచూస్తే మనపోరాటంలో ప్రథమ సంవత్సరమే పూర్తైనది. అమెరికా చైనా యుద్ధాలు సాగుచున్నప్పుడు అంతావిఫలమైపోయినట్లే అనేక ఘట్టాలుయేర్పడినవి. కాని నాయకులు, ప్రజలు నడుము వంచలేదు. అమెరికావారు విజయలక్ష్మిని చేపట్టారు. చైనా వారు సాధించితీరుతారు. నేడు మనపోరాటంలో యింతటి అయోమయావస్థ యేర్పడనేలేదు. కాని అసమర్థులు, అవి నీతిపరులు సాహసించి వారికితోచినట్లు పేలేస్తున్నారు. వీరు దేశద్రోహులు. వీరికి పాఠాలునేర్పి, మనం ముందుకు సాగిపోవాలి. దుర్భరమైనపరిస్థితులు మనకై నిరీక్షిస్తుండ వచ్చును. ఈబాధలు కష్టాలు మనలో వెలితికలుగ కుండా గట్టిపరచడానికే వుపయోగపడాలి. అప్పుడే ప్రజల విశ్వాసము చూరకొనగల్గినంత ప్రజ్ఞావంతులము కాగ లము. అప్పుడే మనపిలుపుకు వారినుండి ప్రతిధ్వని విని పిస్తుంది.

## 2

కొద్దిమాసాలనుండి—ముఖ్యంగా గాంధీ—వైస్రాయి వుత్తర ప్రత్యుత్తరాలు బైటపడిననాటినుండి హింసా - అహింసా, అనే విషయంపై పోరాటవీరులలో ఒక వాగ్వివాదం బయలుదేరింది. ఈ సమస్యపై నా అభి ప్రాయం సువిదితంగా నా మొదటిలేఖలోనే తెలియపర చాను. అదే యీనాటికీ నా గాఢతరవిశ్వాసం. ముందు నేను చెప్పినదే తిరిగి యేకరువుపెట్టనవసరంలేదు.

ఈ వాగ్వివాదాన్నిగూర్చి మాత్రం ఒకటి రెండుమాటలు చెప్పెదను. ఈ సమయంలో, యీవిషయంపై వాగ్వివాదం అనవసరమైన చాద స్తపుపని. ప్రతి స్వాతంత్ర్యయోధునకు తన చిత్తానుసారం పంథాను నిర్ణయించుకోను హక్కు వుంది, ఆ పంథాపై అదేవిధంగా నమ్మకమున్నవారంతా యేకమై, ఒక క్రిమశిక్షణముతోగా తయారుకావలెను. ఇందుకు విరుద్ధమగు మార్గమున నడచువారు - పరస్పర నిందారోపణకు బయలుదేరి, ఒకరిమార్గానికి ఒకరు అడ్డుతగిలి నిలుచోడం మానుట వీరికనీసధర్మం. "కరెంగే యా మరేంగే" మంత్రం యెంతదూరం వ్యాపించిందో, అక్కడెల్లా పరస్పర నిందారోపణకు తావేలేదు. అహింసా సిద్ధాంతములో నమ్మకమున్నవారు-హింసావిధానములో నమ్మకమున్నవారివల్ల గాంధీజీ స్థాయికి మచ్చ గలుగుతుందేమోనని భయపడ నవసరంలేదు. ఇది అర్థంలేని భయం. ఒక లక్షమంది చర్చిలులు, అమెరీలు యేకమై విశ్వప్రియత్నం చేసినా విఫలులు కావలసినదేగాని, అన్యథా నెరవేరదు. గాంధీజీ స్థానం యీ విషయంలో అంత దృఢతరమైనది - పరిపూర్ణమైనదిగా నున్నది. ఇంకోవిషయం మనం గుర్తుంచుకోవాలి. మనం యేమి చేసినను యెంతప్రయత్నంచేసినను బ్రిటిషురాజకీయ వేత్తలను టోరీలుగానిండు, లేబరువారుగానిండు అబద్ధాలాడకుండా చేయలేము. సామ్రాజ్యతత్వానికి మూలస్థంభాలే పచ్చిఅబద్ధాలు. అథవా హింసాకాండే భారత

దేశంలో చలరేగితే దానికిముఖ్యకారణం బ్రిటిషు ప్రభుత్వమేనని మనము గుర్తుంచుకోవాలి.

గాంధీజీ—వైస్రాయి వుత్తరప్రత్యుత్తరాలు ప్రచురించిన నాటనుండి బయలుదేరిన యింకోవాగ్వివాద యుద్ధమేమిటన్న, యీపోరాటాన్ని కాంగ్రెసు ప్రారంభించిందా, దీనిని కాంగ్రెసుఉద్యమము అనవచ్చునా అనునది. ఈపోరాటం కాంగ్రెసుది యెంతమాత్రం కాదను మహామహులు కొందరు, యెంతదూరంపోయినారో గమనింపుడు. బొంబాయి తీర్మానాన్ని ఉపసంహరించుకోడానికి, ఒక కల్లబొల్లి అఖిలభారత కాంగ్రెసు సమావేశాన్ని జరపాలట; యుద్ధానికి తాఖీదు యివ్వకముందే, గాంధీజీని—యితర అగ్రినాయకులను నిర్బంధించినారట. ఇంకసరే—యీతర్కం ప్రకారం బ్రిటిషువారు సకాలానికి నాయకులను నిర్బంధిస్తే, నాయకః వీరుకోరు కాంగ్రెసుఅధికారం మంజూరు కాదు గనుక అసలుపోరాటమేవుండదు. ఆపరిస్థితులలో కాంగ్రెసుపని నవ్వులమారి పంచాంగమాతుంది. ఆగష్టుతొమ్మిదిన శతృవులుపిరికివందలై మన నాయకుల ముట్టడించినపుడు —యిపుడు అధికార పూర్వకంగా కాంగ్రెసుఅనుమతి యివ్వలేదనువారు ఏమిజరుగవలెనని ఆశించుచున్నారు? నిర్బంధింపబడే నమయంలో మహాత్మాగాంధి, వర్కింగుకమిటీవారి అభిప్రాయమేమైవుంటుందని వీరు వూహిస్తున్నారు ? నాయకులు నిర్బంధితులు కాగానే, యేవిధమైన సంచలనము లేకున్నచో, యీ యాదవకుల ముసలాలు సంతృప్తిజెంది

యుండేవారేనా? సామ్రాజ్యవు యినుపమడిమల ముందు దేశంమొత్తం తలవంచేయుంటే వీరు సంతోషించే వారేనా? లేదా యింకోసంగతి—"నిర్బంధములోని నాయకులు విడుదలచేయ్యాలి"— అని నిరసనసభలు జరిపియుండవలెనని వీరితలంపా? (బూటకరింపు విప్లవ వాదులు సలహాయిచ్చినట్లు) అంతకూ విడుదలకాకుంటే యింకాకొన్ని మీటింగులు పెట్టుచు,- సభికులకు విసువు పుట్టు నంతవరకు యిట్టేజరువుచు, - ఆ తర్వాత స్థిర చిత్తంతో, యీ "నిరసనగణాచారులు" హాయిగా యిల్లు జేరి సుఖనిద్రలతో ప్రొద్దుబుచ్చవలెనని వీరితలంపా? ఈ విధంగానే జరిగేటట్లైనచో ఆనాడు బొంబాయి అఖిల భారత కాంగ్రెసుసమావేశంలో, దేశములోని ప్రముఖ నాయకులనోటినుండి కుంభపోతగా దొర్లివచ్చిన వీర ప్రలాపమునకు, - ప్రళయ ప్రచండగా విప్లవము ఉరక నున్నదను సవాళ్ళకు జవాబు యెల్లావచ్చేది? ఈ విధం గానే జరుగకుండా వున్నట్లైనచో, బ్రిటిషు దురాక్రమణ కు యెదురుజవాబుగా, ఎదురుముట్టడి ప్రజలు జరిపాలని ఆశించి, అల్లాంటి సమయంలో నాయకుల నిర్బంధమే ప్రజాపోరాటానికి చక్కవంగినట్లు భావించవలసి యుంటే యింక యీపోరాటం కాంగ్రెసుదికాదు, అనధికారమైన దని గొంతులు బొంగురుబోగొట్టుకొనుటలో నిజాయితీ, నిష్కల్మషం, యెక్కడవుంది? నీవు యుద్ధఘట్టంలో వున్నప్పుడు, శాంతిసమయంలోవలెనే, సావకాశంగా అన్ని లాంఛనాలను పూర్తిచేసుకోను శత్రువు, అవకాశం

యిస్తాడనితలచుట వెర్రికలలుకనుట. ఇదంతా ఆలోచించిచూస్తే, 1942 ఆగస్టుతొమ్మిదిన ప్రారంభమైన జాతీయపోరాటానికి, కాంగ్రెసు అధికారమివ్వలేదనిగాని, తాఖీదివ్వలేదనిగాని, వేలుపెట్టి వెక్కిరించ ప్రయత్నించడం పిరికితనంగా కన్పట్టుచున్నది.

ప్రస్తుత పోరాటానికియిచ్చిన ప్రణాళిక గాంధీజీ, వర్కింగుకమిటీల అధికారముపొందినదేనా అను ప్రశ్నకు వచ్చినప్పుడు అది యింకో వేరే క్రొత్తవిషయం. ఇక్కడ మనం వాస్తవ పరిస్థితులు గమనిస్తున్నాముగాని సిద్ధాంతాలు, రాజకీయ తత్వాలనుగురించి యోచించడంలేదు. వాస్తవ పరిస్థితులలో తగాదేలేదు. కాంగ్రెసువర్కింగు కమిటి కార్యాచరణకు ఒక ముసాయిదా తయారుచేయకనే గాంధీజీని పోరాటపునాయకత్వం స్వీకరించమని ప్రాధేయపడ్డవిషయం, సర్వవిదితమేగదా! అప్పటికి గాంధీజీకి కూడా ఒకకార్యాచరణ కార్యక్రమంలేదు. అఖిలభారత కాంగ్రెసును ఉద్దేశించి ప్రబోధించినవుపన్యాసంలో ముసాయిదాగా కొన్నిసూచనలు మాత్రంచేశాడు. ఈ కొండగుర్తులు "హరిజన"లో గాంధీజీ వ్యాసాలుమాత్రమే ప్రజలకు లభ్యమైనవి. జైలుకుగురిగాక మిగిలిపోయిన కాంగ్రెసువారంతా జేరి, యీ పునాదులపైననే ఒక సమగ్రమైన ప్రణాళికను తయారుజేశారు. వీరు తొందర తొందరగా బొంబాయిలోసమావేశమై "నిషేధకాంగ్రెసు"కు శంఖుస్థాపనజేశారు. అదే యిప్పటివరకు పని జేస్తున్నది. ఆప్రణాళికే యీనాటికికూడా జాతీయపోరా

టానికిచత్రం,హత్యలకుగాని,వ్యక్తిగత దౌర్జన్యాలకుగాని, దానిలో తావులేదు. ఇండియాలో జరిగిన హత్యలలో నూటికి తొంబది తొమ్మిదిపాళ్ళు బ్రిటిషుఫాసిష్టులు, దోపిడీగాండ్రవల్లనే జరిగినవి. ఉద్రేకపూరితులై, యెటూ వూపిరాడక అలసి సొలసిన ప్రజలవల్ల ఒక్కపాలుకంటే యెక్కువజరగడానికి వీల్లేదు అహింసావిధానాలమూలంగా, బ్రిటిషుపాలనను పడగొట్టి చిందరవందరజేసి స్తంభింపజేయడం, ఆ నాటినుండి యీనాటివరకుకూడా ప్రణాళికకు గుండెకాయవంటిది. "అహింసఅండగా చివరంటపోము" అను నినాదం యీ పడవనడుపుటకు వెలుగుచుక్క. ఈ ప్రణాళికకు తమంతటతామే హుకుమునిచ్చిన కొందరు, యిప్పుడు కొన్నిభాగాలను యిది అహింసావిధానానికి సమన్వయించదంటు బాధ్యతను తప్పుకొన ప్రయత్నిస్తున్నారు. శ్రీ కిశోరిలాలు మష్రూవాలా అంతటిదొడ్డవారే తృణీకరించుటకుగాని, ప్రజలను విసర్జించమనుటకుగాని, నోరాడకవూరుకున్నారు. 1942 ఆగస్టునుండి కాంగ్రెసు ఆర్గనైజేషన్లు, అనుసరించిన ప్రణాళిక, మూలసూత్రాల ప్రాతిపదిక అంతా యీకాలములో అధికారమున నున్న ప్రజల నిర్వచనప్రకారం—అహింసా సిద్ధాంతకట్టుబద్ధమే అనడానికియెట్టి సందేహమూలేదు. ఎవ్వరైతే యీప్రణాళికను తయారుజేశారో వారు, బాధ్యతవారిది కాదని యెన్నడూ అనలేదు ఆసమయము వచ్చినపుడు కాంగ్రెసు ట్రిబ్యూనలుముందు నిలుచొని, ఛాలా అనందిగ్ధఘట్టంలో,

వారిబాధ్యతను నిర్వహించినందులకు, చివాట్లే వచ్చినప్పటికిన్నీ, హృదయ పూర్వకంగా అంగీకరిస్తారు.

ఈ కథంతా అట్లుండనిండు. ఈ ఆగస్టు ప్రణాళిక నంతా గాంధీజీమెడకు జుట్ట ప్రయత్నించడం, ఘోరమైన అపరాధం. ఈపనిజేయుటకు బ్రిటిషుపాలకవర్గం మాత్రమే తగివున్నది,

# 3

గతరెండు మాసాలనుండి, యీ వాగ్వివాదాలకు మించిన ఒక పెద్దజబ్బులక్షణాలు రంగంలో గోచరిస్తున్నవి పోరాటం ప్రారంభమైన లగాయతుకూడా యీభారతీయ ముఠా కనిపిస్తూనేవుంది. బొంబాయిలో మన నిర్ణయాన్ని వీరు తీవ్రంగా ఖండించారు. "ప్రతిష్టంభన పరిష్కరించాలి" అంటూవారి మనోభీష్టప్రకారం ప్రయత్నించారు. ఏనాడూ కాంగ్రెసువాదులు వీరిని లెక్కలో వేసుకోలేదు. ఇపుడు అవసరం కూడాలేదు. ఇండియా స్వాతంత్ర్యసాధనకు పోరాటం ప్రారంభించిన ప్రతిసారి కూడా "ప్రతిష్టంభన పరిష్కరించాలి" అంటూ యీ ముఠాబయలు దేరుతుంది. శ్రీయుతులు రాజగోపాలాచారి, భూలాభాయిదేశాయి, కె. యం. మున్షీలవంటి వారి న్యాయమగుస్థానము పోరాటవీరుల మధ్యవుంది. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యమునకు వేరుపురుగులైన గుంపునే వీరు అనుసరించారు. ఈలాంటప్పుడు వారికి వీరికి భేదమేమీలేదు.

కాని, కాలంగడిచేకొద్ది సమరవీరులు కారాగార విముక్తులగుచున్నారు. వీరిలో కొందరు - బహుశా కొద్ది మందే సందేహంలేదు.- అవినీతి, పిరికితనాన్ని కనబరచు చున్నారు. వీరుకూడా "ప్రతిష్టంభన పరిష్కరించాలి" అను నినాదానికే చేయూత నిచ్చుచు, ఈ కార్యసాధనకు రకరకాల సూచనలు చేస్తున్నారు.

మొట్టమొదటిసంగతి, అగ్రనాయకులింకను అగ్ని కుంభములపై నిలచియున్నపుడు. యీ కాంగ్రెసువాదు లంతా తిరోగమన సిద్ధాంతాన్ని వల్లించడం నడమంత్రాన పడవనుముంచడం. క్రియారూపంలోగాని, నిజమైన డిసి ప్లిను లక్షణాలుకనుపించవు. తర్కించుకొనునపుడు, పరస్పర విమర్శన, భేదాభిప్రాయాలుపొడమడం ప్రజాస్వామిక సూత్రాల ప్రథమలక్షణాలు. కాని కార్యాచరణ కాలంలో అందును యుద్ధరంగంలో, ఖచ్చితమైన డిసిప్లిను ముఖ్యావసరం. ఇప్పుడు డిసిప్లిను ప్రతికాంగ్రెసువాదిని నిప్పులు చెరుగుచున్న పోరాటపు గీటుపై నిలుచోమని లొంగిపోవుట, తిరోగమనం అను విషయాల్ని పెడచెవిని బెట్టమని ఆదేశిస్తున్నది. ఈసంగతిని సేనాధిపతులుమాత్రమే ఆలోచించవలసిన విషయం. మహాత్మాజీ, మౌలానాఅజాద్‌గారలు యింకను బంధిఖానాలోనేయున్నారు. శాంతిసమయంలోగాని, యుద్ధసమయంలోగాని కుడికాలు వీరేపెట్టాలి. ఇది యుద్ధానికి సంబంధించిన రెండువర్గాలకుకూడా సంబంధించిన న్యాయం. లొంగిపోదామని తోచినపుడు "ప్రతిష్టంభన పరిష్కరించడం" మహాత్మునికి సులభసాధ్యమైన విషయం.

ఈ తతంగాన్ని ముగించడానికే ఆయనను సేనాధిపతిగా ఎన్నుకోలేదు. దీని అంతరార్థంఅంతా గమనిస్తే పోరాటం సాగుతూనే వుండాలని గాంధీజీ ఆశయమని తేలుచున్నది. ప్రతిష్టంభనమునైనా సాగించడం కష్టసమయంలో కనీసధర్మం.

రెండోసంగతి; ప్రతిష్ఠంభన అనే విషయానికి సంబంధించిన సమస్యను కొంతలోతుకుదిగి ఆలోచింతము. ప్రతిష్టంభన పరిష్కరించడంతో, సమస్యంతా తేలిపోతుందని ప్రతివాదు ఒప్పుకొనితీరాలి. జాతీయసమస్యయింకోఅడుగు ముందుకు వేయడం దీని అర్థంకావచ్చును. అలాంటప్పుడు మన గమ్యస్థానానికిది యింకోఅడుగు ముందుకు తీసుకుపోయితీరాలి.

దీన్ని మనస్సులో బెట్టుకొని, ప్రతిష్టంభనాపరిష్కారానికి మార్గాంతరాలను మనం ఆలోచించవచ్చును. దీనికి మూడేమార్గాలున్నవి. బ్రిటిషుప్రభుత్వాన్ని లొంగదీసి మనకోర్కెలను కొనసాగించుకోవాలి, లేదా మనం లొంగిపోవాలి, లేదా రాజీమార్గంగా యిండియా బ్రిటనులమధ్య "శాంతి ఒడంబడిక" జరగాలి. ప్రథమమెట్టు పరిపూర్ణవిజయం. పోరాటవిధానమే దీనికి ఖచ్చితమైనమార్గం. అప్పుడే దాన్నిసాధించగల్గుతాము. విజయసాధన సాధ్యంగాని బేరమని, స్తబ్ధతజూచి చచ్చినట్లే తలచువారు, పార్లమెంటరీ విధానమే స్వాతంత్ర్యమని యోచించినట్లైనచో, లొంగిపోవడ మొక్కటే మార్గం. కాని వీరు యీవిధానంతో కాంగ్రెసునే నిర్జీవంజేసి,

కనీసం యింకోతరంవరకు ప్రతిఘటనాశక్తిని మటుమాయంచేస్తారు. ఇది బ్రిటనుకు పరిపూర్ణవిజయం.

ఇంక రాజీసంగతిని ఆలోచిద్దాం. ఈ కృతిమపుగాలాం, సమస్తవిషయములు తెలిసినప్రజలనే దాని పరిధిలోనికి లాగివేస్తున్నది. చాలాగొప్ప నిష్కల్మషమైన ఆదర్శాలకు యిది చిరపరిచితమైన స్థానమువలె కప్పివేసుకొనియుంది. రాజీఅంటే ఉభయులమధ్య యిచ్చిపుచ్చుకోడం వుంటేనే సాధ్యమౌతుంది.. జాతీయపోరాటంలో నిర్బంధింపబడిన వారినంతా వదలుట; కాంగ్రెసు దాని అనుబంధ సంస్థల స్థాయి "చట్టబద్ధమే"నని వప్పుకొనుట, కాంగ్రెసు పొందవలసిన కనీసలాభములు. పోరాటం చివరంటసాగుతూ వుండడంవల్ల, పరిపాలనావిధానంలో నెత్తిపైబడిన విపరీతభారాన్ని తొలగించుకోడం; బ్రిటను పొందగల కనీసలాభం. ఈ తంతుకు సంబంధించిన రాజీవల్ల బ్రిటను యెక్కువలాభం పొందుతుంది. కాంగ్రెసు యెక్కువ కోల్పోతుందని నాస్థిరమైన విశ్వాసం.

ఇట్టి రాజీలోని గూఢార్థాన్ని ఫలితాల ప్రతిబింబానికిపోల్చిచూద్దాం. యుద్ధంవిషయంలో కాంగ్రెసునిర్ణయం యెల్లావుంటుంది? ఆగస్టు తర్వాత కాంగ్రెసు దృక్పథం మార్పు చెందవలసిన క్రొత్తవిషయం యేమీ జరుగలేదు. ఇండియాప్రజల ప్రాతినిధ్యంవహించి యిండియాప్రజల్రశేయస్సుకు యుద్ధంలో చేరవలసిన స్థితియేర్పడితే సరిగాని, లేకున్న బలవంతపు మాఘుస్నానం విలువపడదు. రెండోవైపు ఆలోచిస్తే — గతసంవత్సరంలో యెంత

రాక్షసకృత్యాలు జరిగాయో, దాన్నే తలచుకుంటే హృదయము,ఆత్మగౌరవమున్న యే కాంగ్రెసువాదియైనా అధికారపూర్వకంగాగాని, అనధికారపూర్వకంగాగాని, యిండియాను పాలించుచున్న గూండాలు, పట్టపగటి హంతకులతో కలవడానికి అంగీకరింపరు. వీరు ప్రజలపై కప్పివేసిన నరకకూపం; ఈ నరకకూపంనుండి కురిసిన నిప్పులవర్షంవల్ల బయలుదేరిన ఆక్రందనాలఘోషలు, యింకను వినుపించుచునే యున్నవిగదా! కదులుటకు వీలు లేని బందిఖానాగృహాలలో ముక్కుపచ్చలారని పసికందుల నుంచి, కొల్లగొట్టి, హత్యలుజేసి, హింసించి, కాల్చివేసి, చిత్రవధ జేసిన, నరహంతకులతో చేతులుకలుపుటకు, కాంగ్రెసువాదులై యుండికూడ యెల్లా తలవంచారో నాకు బోధపడలేదు. ఈ కారణాలవల్ల – యేది యేమైనను – ప్రస్తుత పరిస్థితులలో నిందు అధికారములేనిది – కాంగ్రెసు అధికారము అంగీకరింపగూడనపుడు – 1935 చట్టానికే లోబడి కాంగ్రెసు యెట్లు పనిచేయగలదో నాకర్థం కావడంలేదు. ఇదివరకొకసారి, యీ చట్టాన్ని నాశనంచేయు యుద్దేశ్యంతో కాంగ్రెసు అంగీకరించింది, అందువల్ల తనక్రిందికే నీళ్ళుపారి దగ్గరదగ్గర గందరగోళం పట్టింది.ఆపగలగొట్టివేద్దామన్న బేలత్వమే చివరకు యుద్ధం వల్లపూర్తిఅయింది. బెంగాలుఅసెంబ్లీలోమాల్వీఫజులుల్ హక్ చేసిన చరిత్రాత్మకమైనప్రకటనమూలంగా,నిరంకుశ పాలకులు, చివరకు తమ నగ్నస్వరూపాన్ని మరుగుపరచు కొనుటకుగూడా; రాష్ట్రీయస్వేచ్ఛను ఆపగింజలో

అరవయ్యోభాగంనైనను సాగనివ్వలేదని తేలిపోయింది. (నిర్మొగమాటంగా విమర్శిస్తున్నందులకు క్షమించాలి. రాష్ట్రీయస్వేచ్ఛలోని నిర్జీవత్వం, అంత సమర్థనీయంగా బాహాటముచేసికూడా; మాల్వీహుక్కు, యితర జాతీయ వాదులు, యీనిరర్థకపు పార్లమెంటరీవిధానానికే అంటిపెట్టుకొని వుండడం విషాదకరమైన విషయం. ఏదో ఒక విధంగా కాంగ్రెసుపతాకంక్రింద తేలిపోవు ప్రముఖులుకూడా వీరిలోవున్నారు. ఆ సుప్రసిద్ధ ప్రకటన జేసినతర్వాత, శాశ్వతంగా వెలుపలకు వచ్చివేసి, మహామారి హెర్బర్టుపాలన అంతమొందించుటకు; పార్లమెంటరీ విధానానికి పైమెట్టును గమనించివుంటే - అదివురుష త్వానికి, అనవరత దేశభక్తికి వన్నెబెట్టినట్లుండేదని నా అభిప్రాయం) ఇంక నా దృక్పథానికి తిరిగి వస్తాను. ఆ రాష్ట్రీయస్వేచ్ఛను అట్లే వదలివేయండి. కాంగ్రెసు తిరిగి మంత్రులను రాష్ట్రాలలో పునః ప్రవేశంచేయించి, మరల యీ మురికికూపంలోనే దూకుతానడం దుర్బలత్వం, బుద్ధిమాంద్యముతో చేసిన విపరీతమైన రాజకీయ హత్యా నేరమైతీరుతుంది. 1935 చట్టం సమాధియైపోయింది. తిరిగి దానికై ప్రాకులాడడం జరుగనేజరుగదు. ఇది ప్రతివారు బాగా అర్థం చేసుకోవాలి. తనపై కుప్పతెప్పలుగా పశు తుల్యమగు ఘాతుకచర్యలు, నోరు మెదల్పజాలని అమ ర్యాదలను కురిపించిన ద్రోహులతో, శాంతియుతంగా నివసించడమన్న యిండియాసహింపజాలదు. ఈ నగ్న సత్యాన్నిగూడా బాగా ఆకళింపుచేసుకోవాలి.

ఈ సూత్రాలపైననే రాజీపడితే కాంగ్రెసుస్థితి మరీ క్లిష్టతమ మౌతుంది. కాంగ్రెసుకు "స్వాతంత్ర్యం" రావచ్చును. కానీ, బ్రిటిషు పెట్టుబడిదారివిధాన శ్రేయోభివృద్ధికి, యీ దోపిడీప్రభుత్వం. యుద్ధాన్ని కొనసాగించుకొనుటకు, ఆర్థిక రాజకీయాలలో వేయు ప్రతియెత్తును ప్రతిఘటించి, సామ్రాజ్యతత్వ యుద్ధాన్ని కాంగ్రెసు వ్యతిరేకించితీరుతుంది. కాంగ్రెసు దేశపాలనను స్వాధీనము చేసికొనినంతనే, ఆర్డినెన్సుపాలనాన్ని-ఆధునిక పరిభాషలో చెప్పాలంటే, ఫాసిస్టుపాలనాన్ని - తుడిచిపెట్టి ఆ స్థానే ప్రజాస్వామిక పాలనాన్ని నెలకొల్పలేదు. ప్రజలను బాధలనుండితప్పించడం క్షుధార్తులకు తిండిపెట్టడం, వికలాంగులకు గుడ్డలనివ్వడం, గృహహీనులకు నివాసపు నెలవులు యేర్పరచడంకూడా సాధ్యంకాదు. కాంగ్రెసు గంభీరంగా తన సిద్ధాంతాలనుండి వైదొలగకుండా వుండ నిశ్చయించుకొంటే - ప్రతివిషయంలోకూడా దోపిడీ ప్రభుత్వానికి యెదురై నిలువవలసివుంటుంది. అప్పుడు ప్రతిష్టంభనా పరిష్కారయత్నం నిరర్థకమౌతుంది,

కాంగ్రెసుకు యింకో పెద్దనష్టం వచ్చిపడుతుంది. మహాత్మాగాంధి, అధ్యక్షుడు అజాద్, పండితనెహ్రూ, మొదలగు కాంగ్రెసునాయకులు కారాగారవిముక్తులు కాగానే, ప్రపంచము యిండియాను మరచిపోతుంది. ప్రపంచపరిభ్రమణానికే చుక్కాని పట్టుచున్నామనుచున్న పెద్దలపై, ప్రతిష్టంభన సాగించు ఒత్తిడి చల్లారిపోతుంది. చర్చిలులు, అమెరీలు-యిండియాసమస్య పరిష్కారమైంది,

తిరిగిచూడ స్తవుగాంధీతనగో రెమూకలనుమరలజై ళ్లకుతరు మునంతవరకు ఫరవాలేదని ప్రశాంతంగా నిద్రపోతారు. జైలువెలువడిన జవ్హారుపండితుడు ప్రకటనలు చేయ వచ్చును. అమెరికా పత్రికావిలేఖరులు గద్దలుతన్నుకొని పోయినట్లు తన్నుకొనిపోవచ్చును; అంతవరకే. అందమైన మృదుత్వం, హృదయాకర్షవంతమైన పదగుంభనకుమినహా వీటిలో పటుత్వమేమియు వుండదు. పరిపక్వమైన పద జాలంతో స్టేటుమెంట్లునిచ్చుచు, పెద్దరాజ్యాల పరమా ర్థాల మంత్రించుచున్న నెహ్రూకన్నా, చెరసాలలో మ్రగ్గుచున్న నెహ్రూ, చర్చిలులు, రూజువెల్టులకు పెద్ద గడ్డుసమస్య.

పైన చిత్రించినవిధంగా గాక, కాంగ్రెసుకు అను కూలంగా వుండేటట్లు, రాజీప్రయత్నాలకు, ప్రాతిపదికలను సూచించవచ్చును. ఈ ప్రాతిపదికలేమిటో కొంచెము యోచిద్దాం. క్రిప్సుప్రణాళికకు మించి ఒక్కమాట యెక్కువ చెప్పడానికికూడా బ్రిటను తయారుగాలేదు — అంటే యుద్ధకాలంలో యేమీఅధికారంలేదు; యుద్ధానం తరానికి అసందిగ్ధహామీ. ఈ బ్రిటిష్ముష్టిని, కాంగ్రెసు బాగాఆలోచించి కాదన్నది. ఇప్పుడు యీ రోజున దానినే అంగీకరిస్తుందని, జ్ఞానమున్నవాడెవడు అంగీక రించడు. చాలా సమాధానకొర్కెలను ఆనాడే 1942 యేప్రిలులో "పెనుభూతపు సలహాదారుని" చేతిలో కాంగ్రెసుపెట్టింది. వ్యక్తిగతంగా యేమాత్రం వాటికి నేను అంగీకరింపలేకపోయాను, వాటికే యీనాడుకూడా

కాంగ్రెసు వర్కింగుకమిటి కట్టుబడుతుందంటే నమ్మకం లేనివిషయం. కానీ వాటిని బ్రిటిష్షుప్రభుత్వం ఆనాడు త్రోసివేసింది. ఏవిధంగానైన స్వతంత్రత పరిష్కరింప ఆతు రత పడువారు యీ కనీసపు కోర్కెలకే కాంగ్రెసు అంగీకరిస్తుందని అంచనావేసినా ఆచరణలో పెట్టుట యెట్లు సాధ్యమని తలచుచున్నారు ? పోరాటంతప్ప యింక యే దైన సాధనంకలదా ? ఈవిధంగా ఆలోచిస్తే తిరిగి మనం ప్రతిష్టంభనవద్దకు చేరుతున్నాం.

కాబట్టి ప్రతిష్టంభన యెల్లాగూ తప్పనిసరి. కాంగ్రెసు తీర్మానాలకు అన్యథాతీర్మానించడం, దేశపునైతికభీభత్సం. యెత్తడం మనం నిశ్చేష్టులమై యుండిపోవాలని దీని అంత రార్థం కాదు. జాతీయ అంతర్జాతీయ పరిణామములలో ప్రతిమార్పును వుపయోగించుకొనుచు, యుద్ధరంగ ములో నిలచి, ప్రతిఘటన సాగిస్తూవుండాలి. బ్రిటిషుపాల నపై ప్రతిఘటనసాగుచునేవున్నదని, యిండియానమరనాయ కులు యింకాకారాగారబద్ధులైవున్నారని రుజువుచేయుడం; యిండియా ఆజేయమనియు, ప్రతిఘటనావటిమ నడుము వంచదనియు సాటిచెప్పుట. అప్పుడు యిండియాసమస్య ప్రపంచపు దిక్కులు పిక్కటిల్లేటట్లు ప్రతిధ్వనిస్తుంది. ఆసియా, ఆఫ్రికాదేశములలోని పతితప్రజల ధైర్యోత్సా హాలకు కల్పవృక్షమౌతుంది. "ప్రజాస్వామ్యానికి" పోరా టము సాగిస్తున్నామని బ్రిటను జూపు అంగీటువిషాన్ని మిత్రరాజ్య కార్మికవర్గం గమనించి జాగ్రత్తపడగలదు. యుద్ధానంతర ప్రపంచ భవిష్యత్తు బాగుపడడానికి అవ

కాశా లేర్పడుతవి. మిత్రరాజ్యాలు లేదా అక్షరాజ్యాల విజయంవల్లగానియేవిధంగాగాని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు పొందలేని ప్రపంచము లోని మానవవర్గం యొక్క నాయకత్వాన్ని యిండియా సాధిస్తుంది. కాబట్టి యుద్ధానంతరమువరకు ప్రతిష్టంభన సాగడం నా కుతూహలము. ఎన్నాళ్ళు యుద్ధంసాగుతుందో, ఏ రూపాన్ని తాలుస్తుందో, ఏరకంశక్తులను వదలివేస్తుందో యెవ్వరును నిరూపించలేరు. యుద్ధం యెంతకాలం సాగితే అంతరంగిక పరిస్థితులు అంత అధ్వాన్న మౌతవి—ఒక్క యిండియాలోనేగాదు సుమా ప్రపంచములోని ప్రతిదేశంలో కూడా యుద్ధంలో మార్పువస్తే నూతన సాంఘికశక్తులు ఉద్భవించుటచేత యిండియాలో పరిస్థితులుకూడా పరిపూర్ణంగా మార్పుచెందుతాయి. అప్పుడు ప్రతిష్టించిన ఒకపెద్దఅంగ వేసి దాటిపోవుటకు యీపరిస్థితులే పునాదులౌతవి. "సమ శీతోష్ణానికి" మనము వెనుదిరిగిపోతే, యీ సమశీతోష్ణమే మనచేతులకు సంకెళ్లై తగులుకుంటవి. కానప్రతిష్టంభన మన భవిష్యత్తుకు ఒక సుఖప్రదమైన హామీకాదా!

ఇండియాలో ప్రతిష్టంభ నే వుండాలని బ్రిటను కూడా కోరుచున్నదిగ్గాన మనంకూడా ప్రతిష్టంభనకు ప్రాణంపోస్తూవుండడం బ్రిటను కౌగిళ్ళలోనికి మనకు మనమే దూరడమౌతుందని కొందరు ప్రాధేయపడవచ్చును. ఇది బ్రిటను విధానాన్ని తిరగదిప్పి చదవడమే ఔతుంది. రాజకీయ ప్రతిష్టంభనగాదు బ్రిటనుకోరడం;

రాజకీయపువ్యూహం. కాంగ్రెసును త్రొక్కి వేయడానికి కృత నిశ్చయమైవుంది-వీరైతే యింతకన్నా ముందు కాంగ్రెసు పలుకుబడిని, ప్రజల ప్రతిఘటనాశక్తిలో, స్వాతంత్ర్య కాంక్షలో చీలికలు కల్పించడంకూడా వీరికి ముఖ్యం. ఏ ప్రతిష్టంభనా మూలంగా కాంగ్రెసుశక్తి పెరుగుతుందో, ప్రతిఘటనాశక్తి యినుమడిస్తుందో, స్వాతంత్ర్యమే జన్మ హక్కని బలసిపోతుందో, బ్రిటిషుఘనత, అధికారం అడుగంటుచూ తిరుగుబాటుదారులు బలపడతారో అట్టి ప్రతిష్టంభనను బ్రిటనుకోరుటలేదు. ఈ విధమైన ప్రతి ష్టంభన బ్రిటన్యుక్కోర్కెలను కుళ్ళవేస్తుంది. దాని ఆయుధాన్నే దానిఅంతానికి, పరాజయానికి సాధనంగా మార్చి వేస్తుంది.

## 4

పై విచారణకు, జాతీయప్రభుత్వ సమస్య, కాంగ్రెసు-లీగు ఐక్యతలుకూడా సన్నిహితముగా అంటి పెట్టుకొనివున్నవి:- అన్నిముఖాలా జాతీయప్రభుత్వం-విచిత్రమైన విషయమేమంటే, అట్టి ప్రభుత్వసాధనకు కాంగ్రెసు పోరాటం సాగిస్తుండగా, మిగతా అందరు వాగాడంబరంతో మిన్నకుంటున్నారు. 19 5 చట్టంక్రింది సంకీర్ణమంత్రివర్గాలు, పదాడంబర వైస్రాయి కౌన్సిళ్ళకు మించినదే జాతీయప్రభుత్వమైతే; సభల నిర్వహణాల మూలంగా సాధించలేము. ఈసరళకపు మార్గాన్ని కాంగ్రెసు సంవత్సరాలక్రితం వదలవేసింది. సామ్రాజ్య

సామ్రాజ్యవాదులనుండి — పిటీషన్లమూలంగా — ఆ విధమగు ప్రభుత్వాన్ని సాధించి స్థాపింపగల్గితే కమ్యూనిస్టుల ప్రతిభకు స్వాగత మివ్వవచ్చును. కాని ప్రజలదూషణ, భత్యపు రాళ్ళిచ్చు పెద్దల నిరసనకు మినహా, వారు యింకేమి సాధించలేదు.

జాతీయ ప్రభుత్వమునకు ముందు "కాంగ్రెసు — లీగు ఐక్యత" అను ఆందోళన కొత్తదిగాదు. దీన్ని గురించి యిచ్చట తడవవలసిన ఆవశ్యకతాలేదు. పార్లమెంటరీ విధానానికి అంధకారబంధురములో ప్రాకులాడుచున్న కాంగ్రెసువాదులు, యీ బీట్లువారిన ఆందోళననే తిరిగి సాగించుచున్నారు. బహిరంగ పోరాటమునకు వెరచిన వీరు యీ కక్కుగొందుగులకై దాగుడుమూత లాడుచున్నారు. ఈ ఆందోళనకు సృష్టికర్తయగు రాజగోపాలాచారి, అనవసరంగా చేతులు కాల్చుకొని, యింకను జిన్నాగారి గుమ్మంవద్ద గాలిపోసుకుంటున్నసంగతి మరచినట్లున్నారు. మహాత్మాగాంధీవ్రాసిన జాబు యింతవరకును లీగు నాయకునికి చేరలేదను సంగతికూడా మరిచారు. (డెలివరిగాక, చదవని యీజాబుకు జవాబు చదవడమనే సత్కృతైన అదృష్టం మనకు పట్టింది.) ఈ కారణంవల్ల యీ విషయాన్ని సంక్షిప్తంగా విచారించడానికి యిచ్చట పూనుకొన్నాను.

ఎంతటి తెలివిగలవారైనా, సులభంగా బ్రిటిషు మెరకు గురిగాక తప్పదంటే, బ్రిటిషు ప్రచారం యొక్క అనన్య సామాన్య తెలివితేటలకు ప్రతివారు మెచ్చు

కొనితీరాలి; ఇదైనా కారణం కావాలి, లేదా ప్రతిఅడుగు నకు క్రిందికిజారుచు క్రమేపి మనజాతీయత గంగ పాతై అడుగంటిందని అయినా ప్రతివాడు గుర్తించితీరాలి. బ్రిటిషువారి ప్రచారము అమాయకులగు అమెరికావారి కన్నుగప్పిందంటే సహజమేగాని, (వీరిలోకూడా యే కొద్ది మందో దీనిలోనికి తొంగిచూస్తున్నారు.) యిది భారతీయునికే కంట కారం గొట్టిందంటే ప్రపంచవిచిత్రా లలో యిది ఒకటిగా భావించి తీరాలి. ఇండియాలోని యీ మధ్య సంఘటనలు, బ్రిటిషు నక్క వినయాలను చిలికి గుట్టు బట్టబయలుచేసినవి. చివరకు ఆరిఆకైనా బట్టబయలైన యీ బ్రిటిషు సామ్రాజ్య నిజస్వరూ పాన్ని అవసరాన్ని కప్పిపుచ్చడానికి దొరకదు, అయినను, యిండియా స్వాతంత్ర్యం పొందడానికి కాంగ్రెసు - లీగు ఐక్యత లేదని నమ్మి, దేశపు ప్రజల మొత్తాన్ని నమ్మించ దరు భారతీయులు తంటాలుపడుచున్నారు,

గత కొద్దిమాసాలనుండి, బ్రిటను తన విధానం లో యేమైన మార్పుచేసుకో నిశ్చయించిందా అంటే— యిండియా సామ్రాజ్యాన్ని, యెంత పణాన్నైనా ఒడ్డి నిలుపుకోవాలని కృతనిశ్చయమైంది. క్రిప్సురాయబారం వల్ల యేదైనా నిర్మలంగా తేటతెల్లమైందంటే, యుద్ధ కాలంలో నిజమైన అధికారాన్ని భారతీయులకు యిచ్చు టకు యేమాత్రం వీలులేదని మొండిపట్టుకు దిగింది— ఏస్థాయిలో ఐక్యత యేర్పడినా అది అసలు సందర్భాను సారమే కాదట. కాంగ్రెసు-లీగులు కలసిమెలసి, ప్రజా

ప్రాతినిధ్యమగు జాతీయప్రభుత్వమును యిచ్చితీరాలని పట్టుపట్టినను, యుద్ధకాలంలో యివ్వడానికి వీలుపడదని క్రిప్సు నిర్మొగమాటంగా తేల్చిచెప్పాడుగదా! (భవిష్యతుకు బ్రిటను యిచ్చు హామీని యెవ్వరు గణించారు, గణించనున్నారు.) ఇంత తేటతెల్లంగా బ్రిటిషువిధానం కన్ను గట్టుచుంటే, కాంగ్రెసు - లీగు ఐక్యతకొరకు ఆందోళన చేసినందువల్ల కలుగు ఫలితమేమో బోధపడుట లేదు. పై పెచ్చు చర్చిలులు, అమెరీలు నిరాఘాటంగా ప్రపంచముచుట్టు గిరాటుకొట్టించుచున్న అబద్ధాలను మన్నించి ఆదరించినట్లాతుందిగదా. జాతీయయిండియా పైన సామ్రాజ్యతత్వ దురాక్రమణకు, కాంగ్రెసు – లీగు ఐక్యత కొరకు కలవరపడడం ఒక అండమై నిలుచుంటుంది,

కాంగ్రెసు-లీగు ఐక్యత చేకూరిన తర్వాతకూడా, యిండియాకు జాతీయప్రభుత్వాన్ని మంజూరుచేయక పోతే, కనీసం స్వాతంత్ర్యశక్తులు బలబడునుగదా- యిందుకైనా దీని సాధనకొరకు పాటుబడడం అంగీకార యోగ్యంకాదా అని అడుగవచ్చును. చేకూరిన ఫలితమే అది అయినచో యీ అభిప్రాయానికి అవకాశముంది. టానికి సిద్ధమై, స్వాతంత్ర్యానికి త్యాగము జేయగల వారే మన దేశంలో స్వాతంత్ర్యసాధన బలగాలు. ముస్లిము లీగు జీవితమంతా తరచి చూస్తేకూడా పోరాటానికి, త్యాగానికి సంబంధించిన ఘట్టం ఒక్కటైనా మచ్చుకు కూడా కనుపించదు. ఇప్పుడైనా యీమార్గాన్ని అనుస రించడానికి సిద్ధంగాలేదు. పోరాటంలేకుండానే

యిండియాస్వాతంత్ర్యాన్ని సాధించలేదు. ఇందుకు ముస్లిములీగు సర్వసన్నద్ధం కానపుడు దీనితో రాజీ— స్వాతంత్ర్యశక్తులను యేవిధంగానూ బలపరచలేదు ముస్లింలీగు స్వాతంత్ర్యపోరాటంలో సన్నద్ధమైనపుడు, యేరోజునసైనా దానితో పరిష్కారము చేసుకోవచ్చునని జవహారుపండితుడు చెప్పినది వట్టిమాటకాదు.

ఇంతవరకు కాంగ్రెసు లీగు ఐక్యతకు సంబంధించినది. ఇంక లీగు రాజకీయాలను గురించి ఒక్కమాట. లీగు కీలకం బ్రిటను చేతిలో వుందని సులభంగా అర్థం చేసుకోవచ్చును. జిన్నా 16 అణాల దేశద్రోహి అయితే నేటి మిర్జాఫరన్నమాట. బ్రిటనునుండి తను కోరేదంతా సాధిస్తానని జిన్నా తలంచుచున్నాడు, ఇంకను బ్రిటను తన ఆధీనములోనున్న అధికారవుమూటలను దాని చేతిలోని కీలుబొమ్మలకు యిచ్చుటకు అలవాటుపడలేదు. కావలసినంతవరకు జిన్నాను వుపయోగించుకొన్న తర్వాత పనికిరాని గులాములను పారవేసిన మురుగుదొడ్డిలోనే జిన్నాను పారవేస్తుంది. ఇదివరకెందరినో యీవిధంగా పారవేసింది, మిర్జాఫరుకూడా అక్కడనే వున్నాడు. ఇవ్వాళ బెంగాలును పాలించునది మిర్జాఫరు సంతతిగాక, దుర్మార్గుడగు క్లైవు బంధువులన్న సంగతి మహమ్మదీయులు మరువరాదు. జిన్నా తనకుతాను అతి తెలివిగలవాడుగా లెక్కవేసుకొనుచున్నాడు. భావిచరిత్రలో జిన్నా ఘనతనుగాక, చరిత్రాత్మకమగు హిట్లరు మొత్తులకు యీడువోని అవివేకతనుగూర్చి లిఖింపబడుతుంది,

జిన్నా పాకిస్థాను కావాలంటాడు. దానికొరకై పట్టుదలవుంటే సాధించడానికి పోరాటానికి దిగాలి. దాని కొరకై త్యాగాలు చెయ్యాలి. అవసరమైతే మృత్యువును ఆహ్వానమివ్వాలి. ఇక్కడనేవుంది చిక్కు. ముఖ్యంగా యీ విషయాలకే, జిన్నా-జిన్నా అనుసరబృందం, యెప్పుడు సన్నద్ధంకాలేదు. కాబట్టే పాకిస్థానుసాధనకు మూర్ఖంగా మహాత్మాగాంధీని దుయ్యబడుతాడు. కానీ అమాయకుడైన గాంధీ చేతుల్లో జిన్నాగారి యీపవిత్రభూములు లేవు. రుధిరశిక్తములగు సామ్రాజ్యపిశాచపు మడమలక్రింద యీపవిత్రభూములు అణగారి అపవిత్రములై - కలుషవంతములై - తేజోరహితములై పోతున్నవి. జిన్నాగారు తన "జన్మభూమిని" స్వాధీనం చేసుకొనగల్గితే, కనీసం యిండియాలో కొంతభాగమైనా స్వాతంత్ర్యం పొందిందని కాంగ్రెసు సంతోషిస్తుంది. బ్రిటిషుఆధీనములో ఉడుకు ఉడుగారి, నామమాత్రావశిష్టములై పోతున్నాయి. కాని వీటిని స్వాధీనముచేసుకొనుటకు అవసరమైన మూల్యాన్ని జిన్నా చెల్లించలేదు గనుక, ఆ ప్రశంసకు పోడు. కాబట్టి కాంగ్రెసును తూర్పార పట్టుచు, బోల్తా కొట్టించడానికి కాలంగడుపుచున్నాడు. కాని పర్యవసానంగా చివరకు చర్చితే జిన్నాను పల్టీకొట్టిస్తాడు. ఏనాటికైనా యిండియాను విభాగించడానికే యీ పురాతన పార్లమెంటు పూనుకొన్నట్లైన, అది సామ్రాజ్యతత్వపు స్వప్రయోజనానికి తప్పితే, హిందుస్థాన్‌లో ఊహాగానం చేస్తున్న ప్రత్యేకపు ముస్లిము దేశానికి స్వాతంత్ర్యాన్ని

ప్రసాదించడానికి మాత్రంకాదు. అల్సరు ఐర్లండకు యే విధమైన మేలును చేకూర్చలేదు సరికదా, బ్రిటిషుశక్తి హృదయగోళంలోకి దూసుకుపోవడానికి తావిచ్చింది.

లీగు అసలురాజకీయాలు సామ్రాజ్యతత్వపు మంత్రాంగముక్రింద తయారైన అగ్నిముఖాలు. జాతీయ ఆవశ్యకతకు ప్రభలమైన వ్యతిరేకచిహ్నాలు.

## 5

శ్రీ సుభాస్ చంద్రబోసు, షానాన్ (సింగపూరు) లో స్వాతంత్ర్య భారతజాతీయ తాత్కాలికప్రభుత్వాన్ని నిర్మించిన సంగతి, జపాను ప్రభుత్వం గుర్తించిన సంగతి మీరు వినేవుంటారు. భారతజాతీయ సైన్యమును కూడా తయారు చేసినట్లును, అది దినదినప్రవర్థమాన మగుచున్నట్లుకూడా వింటున్నాము. ఈ పరిస్థితులవలన మనకు కొంతప్రత్యేకత గలుగగలదు. మీకు తెలిసిన యీసమాచారానికి యింకో ముఖ్యవిషయం అందజేస్తు న్నాను. బెంగాలులో క్షామబాధితులకు తిండిని చేకూర్చుటకు గావలసినంత బియ్యాన్ని సరఫరాచేయుటకు సంసిద్ధంగావడం సుభాసుప్రభుత్వముచేసిన మొదటిపని. కాని యీస్థానిక కీటకాలు రూపుమాయుటే శ్రేయస్కర మని బ్రిటిషు ప్రభుత్వం భావించింది,

సుభాసును క్విస్లింగ్ అని దుర్భాషలాడడం వేలికైన విషయం. బ్రిటిషుప్రభుత్వ క్విస్లింగులు ఆయనను నిందించుటకు వెనుదీయరు. సునాయసంగా ఆపనిని చేశేస్తారు.

గాఢతర దేశభక్తుడని, దేశస్వాతంత్ర్యపోరాటంలో ప్రథమ శ్రేణికి చెందినవాడని యిండియాయెన్నడో గుర్తించినది. ఆయనకు ముఖ్యంగా కావలసిన డబ్బు డాలకం, సాధన సంపత్తి, అక్షరాజ్యాలు సరఫరా చేస్తున్నవన్న సంగతి తేటతెల్లమైనదే. కాని ఆయన ప్రభుత్వంలోను, జాతీయ సైన్యంలోను వున్నవారందరు, బ్రిటిషుప్రభుత్వాన్ని ద్వేషించుచు, తల్లిదేశాన్ని స్వాతంత్ర్యదేశంగా జేయు తహతహలాడుచున్న కరకుయిండియన్లు అన్న సంగతి మొదట గమనించవలసిన విషయం. మిత్రమండలిఅభిలాష ప్రకారం, యీప్రదేశములో యేర్పడిన సంధాన ప్రభుత్వాలన్నియు వాటికి కావలసిన ముఖ్యావసరములను మిత్ర దేశములనుండే తీసుకొనుచున్నవన్న విషయం రెండవహాంశం. ప్రపంచపు ఆధిపత్యపు యెత్తులలో యే అవసరాలమూలంగా పెద్దరాజ్యాలు చిన్న, బలహీన రాజ్యాలకు ఉదారంగా సహాయం చేస్తారో, యెవ్వరు తెలియజెప్పలేరనునది మూడవ విషయం. జపాను బర్మాకు చేసిన స్వాతంత్ర్యప్రదానమునకు కొంత ప్రచారం జరిగింది. టోజోప్రభుత్వంచేసిన యీ దాతృత్వాన్ని పొగడి సోవియటు ప్రభుత్వం పరామర్శించిందని ఒకవార్త తెలియజేస్తున్నది. దాన్ని అట్లు వదలివేయుదు. బ్రిటిషు "ప్రజాస్వామికం" క్రిందకన్నా ఫాసిస్టుదేశపునాయకత్వం క్రింద యెక్కువ స్వాతంత్ర్యం అనుభవిస్తున్నదని నిస్సందేహంగా నాటిచెప్పగలము. సుబాసుచంద్రబోసు విషయం చూస్తే, తన శత్రువుకు శత్రువు వద్దనుండి సహాయం

పొందడం తరతరాలనుండి వచ్చుచున్న రాజకీయగుణ పాఠాలు తెలియజేయు నీతి-మాకియవెల్లికన్నా పురాతనం నుండి, కౌటిల్యునికన్న వెనుకతరాలనుండి-కాన దానినే అనుసరించాడని నొక్కి వక్కాణిస్తున్నాడు. ఈవిధంగా మూడవపార్టీపై ఆధారపడి సహాయముపొందుచున్న పుడు, చివరకు మోసగింపబడితే మోసగింపబడవచ్చును కాని, ఆయన కార్యసాధనలోని నిజాయితీని, విజ్ఞానము యొక్క ఉన్నతస్థాయిని అనుమానించ వీలులేదు. దేశస్వా తంత్ర్యసాధనలోను, రక్షణలోను, ఆయన జయాపజయాలు పరిస్థితుల పరిభ్రమణాన్ని బట్టివుంటుంది. దీనిరూప మిద మిద్ధమని మనదేశనాయకులుగాని, యింకయే యితరదేశపు రాజకీయ నాయకులుగాని తేల్చిచెప్పలేరు. అది సాధ్యం కాని విషయం.

షావాఘ్‌లోని యిండియనుప్రభుత్వాన్ని, జాతీయ సైన్య ప్రాముఖ్యాన్ని మనం గుర్తించాం. మన స్వాతంత్ర్య ప్రాప్తి మనయొక్కబలంపైనా, శక్తిసామర్థ్యాలపైన ఆధారపడివుందని తట్టి చెప్పుచున్నాను. నిరర్థకమైన అస మర్థత వ్యక్తపరచుచు, వెలుపలనుండివచ్చు సహాయము నకు అఱ్ఱులుజాచటం - ఆత్మహత్యా రాజకీయాలంటారు. సుభానుసైన్యము యెంతపెద్దదైనను, యిండియా లోని మిత్రరాజ్యాబలాలను ఓడించగలదని తలచడం మూర్ఖత్వం. ఏసైన్యమైన, వీరిని ఓడిస్తుందంటే అది జపాను సైన్యమై వుండాలి. ఇండియాలో బ్రిటిషువారిని జపానుఓడించుసన్నిన సుభాసు టోజోలమధ్య యేవిధమైన

కలయికవున్నా ప్రశాంతంగా యిండియాను మన చేతుల్లో పెట్టిపోరు. ఇండియాలో అక్షరాజ్య మిత్రరాజ్య సంఘర్షణ జరుగునెడల, అధికారాన్ని కైవసంచేసుకోడానికి మనం తయారుగ వుండాలి. ఈకార్యాన్ని చక్కబెట్టడానికి, మనము తయారై యుంటేగాని, మనకు సుభాసుజాతీయ సైన్యమువంటి వెలుపలిసహాయము సహాయపడగలదు. ఇండియాను కైంకర్యం చేయకుండా టోజోనుత్రోసి రాజనవచ్చును. ఇండియా జాతీయమెత్తుగడల యీ పొందికను సుభాసు యెంతవరకు గుర్తించియున్నాడో చెప్పుటకష్టము.

యుద్ధము మన గుమ్మముముందునిలచి కాలు దువ్వుచున్నపుడు మనం యేమిచెయ్యాలి అనుముఖ్యమైన ప్రశ్నను యిపుడు మనం దాటవలసియున్నది. బ్రిటిషు విధానంమూలంగా ప్రతిభారతీయుడు బ్రిటిషుద్వేషియై జపానుకు స్వాగతమివ్వడానికి తయారుగాకున్నను కనీసం ఆంగ్లో జపాను పోరాటంలో తటస్థంవహించ నిశ్చయించు కొన్నారు. ఈ తటస్థవిధానము మనమెడకు ఉరిత్రాడు. ఈ మంకువిధానాన్ని వదలగొట్టి దీనిస్థానే నిర్మాణకార్య విధానాన్ని పెంపొందింప పాటుబడవలెను. యుద్ధంజరుగు చున్నట్టిగాని, జపాను ఆక్రమించుకొన్నట్టిగాని, చొచ్చు కొనిపోయినట్టి ప్రదేశాలలోగాని, పరదేశీయుని సివిలు పాలనం బలహీనపడుతుంది, లేదా అంతమొందిపోతుంది. ఈ ప్రదేశాలలో మనం స్వాతంత్ర్యప్రభుత్వాన్ని స్థాపించాలి. ఈ ప్రభుత్వపుపేరుతో తిరోగమనం సాగిస్తున్న

యుండియను దళాలను, అచ్చటనే నిలచిపోయి ప్రజా సేనలుగా మారిపోవలసినదిగా ప్రాధేయపడవలెను. తూర్పు రాష్ట్రంలో యీ విధమైన ప్రభుత్వాన్ని స్థాపించడానికి యిప్పటినుండి మనము తయారుకావలెను, ఇదే కాలము గడచేకొలది దేశవ్యాపితం గావచ్చును. ఈ సన్నద్ధ కార్య క్రమం అనేకరకాల ప్రశ్నలకు తావిస్తుంది, వాటి నన్నిటిని యిచ్చట క్రోడీకరించడానికి వీల్లేదు, స్థూలసిద్ధాంతాలను తెలియజేసి, ముఖ్యంగా సమరవీరులు- సర్వసాధారణంగా ప్రజల – అప్రమత్తులు కాకుండా మేలుకొలిపితే చాలును,

# 6

ముగింపుకు ముందు ఒకటి రెండు మాటలు యుద్ధాన్ని గురించి చెప్పెదను. యుద్ధపు శీలాన్ని గురించిన నిరర్థకమగు వాగ్వివాదం–భారతజీవితానికి గుదెబండలు - ఇంకను హాయిగా ఉబుసుపోకకు సాగిస్తునేవున్నవి, పంచమాంగదళాలు నేటికికూడా – సహజలక్షణమేకదా- యిది ప్రజాయుద్ధమని మొండికాలు జాపుచున్నారు. రాజకీయాలకు మొదలు తుదాకూడా వాగ్వివాదమేనని తలపోయువారు, అప్పుడప్పుడు భీకరంగా ఉద్రేకపూరితులై మాటలకుమించి చేతులుగూడా కలుపుకుంటున్నారు, బ్రిటను యుద్ధపు తరహాను గూర్చిగాని దీనికి తందన్నతాన అను స్వదేశీయుల గుణలక్షణాలనుగూర్చి

గాని, యిండియాప్రజలకు యెట్టిసందేహంలేదు. గత పాలులో బ్రిటిషుఫాసిజం పశుతుల్యమైన ఘోరాలను ప్రజలకు చవిచూపింది. కారాగారాలలో మ్రగ్గిపోవు చున్న వారికిన్ని, దేశవ్యాపితమైన హత్యాకాండకు తమ ముద్దుబిడ్డలను బలిపెట్టినవారికిని, యిండ్లు తగులబడి, దోపిడికి యెరయై ఆస్థులు కోల్పోయినవారికిని, తమ స్త్రీలకు మానభంగము జరిగినవారికిని, క్షుద్బాధకు గురియై బజారులలో యెలుకలు మాదిరి ప్రాణాలు వదలు చున్న వారికిని-, వీరందరికి యిది యేతరగతి ప్రజాయుద్ధ మైనది బోధపడింది. బాబరు మహాలులో నరికిన యువ రాజుల శిరస్సులను ఒకపళ్ళెరమునసుంచి-యీనిస్సహాయు లగు పుత్రులతండ్రియగు చివర మొగలాయి చక్రవర్తికి-విక్టోరియా పంపిన బహుమతిగా ఒక బ్రిటిషుసేనాధిపతి అందజేశాడు. మరల ఒకటిన్నరశతాబ్దానికి నేడు, అమెరికా పత్రికావిలేఖరులముందు గాంధీశల్యాలను దహనంచేయుటకు కావలసిన గంధపుచెక్కను సిద్ధపర చానని టాటెన్హాం డంబములు కొట్టుచున్నాడు. బ్రిటిషు పాలనకు హేతువులగు యీ ముక్కూర రాక్షస ఘాతక కృత్యాలను, ఆదినుండి అంతమువరకు (అంతము సమీపించినట్లే) తేటతెల్లంగా భారతదేశం అర్థంచేసుకున్నది. మార్క్సు సిద్ధాంతవేత్తలమని దొంగమునుగులువేసు కొన్న దేశద్రోహులు ఇప్పుడువచ్చి, ఫాసిజమంటే యేమిటో చెప్పవలసిన ఆవశ్యకత యేమియు లేదు.

యుద్ధమిప్పుడే అయిదోసాలులో ప్రవేశించినది. సౌఖ్యానికి, జీవితానికి యిదిచేసిన ఘోరాపచారాన్ని తిరిగి బాగుపరచుట మనతరంగాదు. ఇరువైపులనున్న సామాన్యప్రజల క్షేమము యీ యుద్ధాన్ని సాధ్యమైనంత త్వరలో తుది ముట్టింపమనుచున్నది. కాని చర్చిలులు రూజువెల్టులుగాని, హిట్లరులు టోజోలుగాని యీ పనిని పూర్తిచేయవలేరు. ఈ కసాయితనాన్ని యిప్పుడు ఆపివేయమని అరచినా, అది తప్పక ముందుయింకను ప్రళయములగు ఆయుధాలను తయారుచేసుకొని మరల వర్ణనాతీతంగా కసాయితనాన్ని కొనసాగించుటకు సమాయత్తమగుటకు విరామమునకు కాలముమాత్రమే. యుద్ధానంతర ప్రపంచ పునర్నిర్మాణానికి, మిత్రమండలి తయారుచేయుచున్న ప్రణాళికలు-తరతరాలనుండి ప్రపంచములో ఆలవాలమైయున్న అగ్రశ్రేణి తరగతికి, జాతీయ నిరంకుశత్వానికి, పెట్టుబడిదారికొట్లాటలకు, అశాంతికి - ఒకే తరంలో రెండు ప్రపంచమారణయుద్ధాలు తెచ్చిపెట్టినట్లే మూడవదానికి కూడా పునాదులు వేస్తుంది.

నిజంగా యుద్ధం అంతంకావాలంటే ప్రపంచములోని సామాన్యమానవుడు పూనుకోవాలి. కాని వారి రోదన అరణ్యరోదనమైనది. ప్రపంచ సామాన్యప్రజలకు అండమై నిలుచోడానికి అర్హతగల రష్యా, తానే యింటి వద్దను, బైటప్రపంచములోను, నిరాదరణచేసి, త్రొక్కి, త్రోసివేసి, ఆంగ్లో అమెరికాలతో చేతులుకలిపి సామ్రాజ్య విధానంతో, పెట్టుబడిదారివిధానంతో కలసిమెలసి

పోవుచున్నది. ప్రపంచములోని నలుమూలల ప్రజలు పెట్టుబడిదారివర్గపు అడుగుజాడలలో నడచిపోవుచున్నారు. ఈ విధంగా వ్యక్తిత్వం కోలుపోయి, ఆధునికసంఘానికి, నూతన ప్రపంచానికి నాయకత్వం వహించవలసిన అవకాశాన్ని కోల్పోవుచున్నారు.

ఆకుకు పోకకు అందక, భూమిపై కృశించి, తపించి, పాతచెప్పులుగా నెట్టివేయబడుచున్నవారి కోర్కెలకు, యీాస్థితములకుయీాపరిస్థితులలో భారత దేశముమాత్రమే ప్రాతినిధ్యం వహించగలదు. ఇండియాస్వాతంత్ర్య పోరాటము సామ్రాజ్యవ్యతిరేక సంఘటనము. (సహజంగా ఫాసిస్టువ్యతిరేకికూడాను. సామ్రాజ్యవిధానపు ముద్దుబిడ్డేగదా ఫాసిజం) సామాన్య మానవుడు జోక్యం కలిగించుకొని యుద్ధ విరామానికి పాటుబడుటకూడా జౌతుంది. మిత్రరాజ్యాలగాని, అక్షరాజ్యాలగాని, విజయం మన ఆశయంకాదు. దేనినికూడా వూనుకొని తిరుగవలసిన అవసరంలేదు. ప్రపంచ సామాన్యప్రజలంతా యేకమై, సామ్రాజ్య విధానాన్ని, ఫాసిజాన్ని రెంటిని ఓడించడానికే మనం పాటుబడుచున్నాము. మన పోరాటం మూలంగా యుద్ధాలను అంతమొందించు మార్గాన్ని జూపి, నలుపు తెలుపు, పసుపు అనుభేదం లేకుండా లోకకల్యాణమునకు దారిచూపగలము.

మీకాలాన్ని చాలా కాజేశాను. ఇంక ముగించి వేస్తాను. లాభసాటి బేరంగా కనుపించుచున్న ద్వార ప్రవేశమునకు పోరాటమొక్కటే మార్గమని, దాన్ని ఆవకూడదని మీకు తెలుపుటకు యింతవరకు ప్రయత్నించాను. ఏవిధంగా మనం పోరాడాలి?

ప్రస్తుత పరిస్థితిలో, ముఖ్యంగా కృతనిశ్చయులై యున్న సమరవీరులు వారి విధిని నిర్వహించవలసిన ముఖ్యావశ్యతను గూర్చి యిదివరకే యెరుకపరచాను.

నిర్మాణసంస్థను నిర్వహించుచు, బలపరచుచు, పెద్దదాన్ని చేయుటకే సమరవీరులు ప్రప్రథమంగా పాటుబడాలి. నిర్మాణసంస్థ లేకుండా యే సైన్యంగాని — చివరకు అహింసా సైన్యంగాని పోరాడలేదు ప్రజల ప్రతిఘటన పాలపొంగువంటిది. సాంఘిక శక్తుల ప్రతిఫలం గూడాను. విప్లవరూపాన్నియిచ్చి, సందేశాన్ని అందజేయుటకు విధిగా నిర్మాణసంస్థ వుండితీరాలి. ఈ కాంతిరేఖ సాయముతో ప్రజలమధ్య నిర్మాణకార్యక్రమము సాగించునపుడు సమయానుకూలముగా దోహదమగునదే పాలపొంగువంటి యీ ప్రజా తిరుగుబాటు. మనపోరాట నాయకులు, నిర్మాణసంస్థ నిర్వహణకు ముఖ్యమైన సమస్యలను నిరాదరణచేస్తున్నట్లు యీమధ్య మనపోరాటపు చరిత్రమూలంగా రుజువగుచున్నది. అహింసావిధానానికి, రహస్యవిధానానికి యెక్కడా పొందిక లేకపోవడమే.

నిర్మాణసంస్థ విషయం పెడచెవిని పెట్టుటకు అంతరంగిక కారణమైయున్నది. యిందు సందేహంలేదు. అహింసా విధానానికి రహస్యవిధాన ముంటేనే తలకాయనొప్పి. అయినను పోరాటము సాగించుచున్న నిర్మాణసంస్థకు రహస్యం తప్పనిసరి. ఈ అసందిగ్ధవిధానానికి నేను మందును కనిపెట్టానని, కపట నాటక మాడడం నాకు యిష్టంలేదు. అహింసావిధాన భాష్యకారులు మందును కనిపెట్టు నంతవరకు కార్యసాధన శ్రేయస్సుగోరి అహింసా విధాన అనుచరులుగూడా మెలికలు వేయకుండా రాజీకి దిగి రహస్య నిర్మాణసంస్థ యేర్పాటును అంగీకరించడం ముఖ్యావసరమని హృదయపూర్వకంగా విన్నవిస్తున్నాను. ఈవిధములగు రాజీలకు మహాత్మాగాంధీగూడా ఒప్పుకుంటాడు. బహిరంగ కార్యవిధానాన్ని ఆకాశానికి యెత్తి - రహస్యవిధానాన్ని నిరసించినందువల్ల యీకష్టమైన పనిని పరిష్కరించనూలేము; మన ఆశయ పురోగమనానికి ముందుకు సాగనూలేము.

కాన నిర్మాణసంస్థ మనపోరాటపు ప్రణాళికలోని ప్రథమహాంశం ఇది పోరాటానికి నిఖాలసైన హామీ. ఈ హంశాన్ని గురించి చెప్పునపుడు, స్థిరంగా నిలచి కార్యక్రమాన్ని కొనసాగించడానికి నిషేధకాంగ్రెసు, నిర్మాణ సంస్థలకు ప్రాణము బోయుచు పాటుబడవలసిన విషయాన్ని గురించి నొక్కిచెప్పుచున్నాను. ఈ నిర్మాణ సంస్థలు మనపోరాటాన్ని సంఘటితపరచడానికి ప్రాణము వంటివి. వీటికి చట్టబద్ధమైన పునాది లేదనడం నిజమేగాని,

యీ సంస్థలు లేనిది యీరోజులలో కాంగ్రెసు ప్రజలను కలసికొని పనిచేయుచు, శత్రువుతో పోరాడడానికి మార్గమేలేదు. చాలారాష్ట్రాలలో యీ నిర్మాణసంస్థలు సరిగా పనిచేయుటలేదు. వర్కర్లు తరుగుగావడమే నిర్మాణ సంస్థలలో యీదుర్బలత్వానికి కారణం. కొన్నిసమయాల్లో కావలసినంత నిధిలేకపోవడం; సమర్థవంతులగు వర్కర్లు కొంతకావడంకూడా ఒకకారణం. వీటిలో ప్రతిదానిని సాధించగలము. భారతజాతీయ కాంగ్రెసు కేంద్రనిర్వాహకులు, రాష్ట్రపు కనీస అవసరాలనైనా యీడేర్చి, చేయూత నివ్వడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. వీరి ప్రయత్నాలు కాస్తో కూస్తో చాలావరకు ఫలప్రదములైనవి. ప్రస్తుత విప్లవములో యుండియా బేరీశెట్ల కథనాన్ని పరీక్షించడానికి యిది సమయంకాదు, కాలమూగాదు. వీరిలో విశాలదృక్పథంగాని, అవగాహనగాని వూజ్యమని చెప్పుచు, యీ హంశాన్ని ప్రస్తుతానికి వదలివేయవచ్చును. వారిముందు గోచరించు మార్గముననే యుంకా కొంచెము ముందుకు నిగిడించి చూచినచో—జాతీయ విప్లవమే అణచివేయబడినట్లైన ప్రపంచయుద్ధానంతర సమస్యలవల్ల కలవరపడు బ్రిటను వీరికి నిలుచోడానికి కూడా జాగానివ్వదని గ్రహింపగలరు. కాబట్టి నిండు స్వార్థపరాయణత్వమే, హృదయపూర్వకంగా జాతీయ విప్లవములో చేరమని వీరిని శాసించి యుండవలసినది. వీరి స్వార్థపరాయణత్వంలోకూడా అసాధభూతి వున్నా

డని, సంకుచితదృక్పథంగల మూఢులని వారికివారే రుజువుచేసుకొన్నారు.

ఏమిచేయవలెనన్నను కావలసినంతధనాన్ని సాధించాలి. శక్తివున్నవారు శక్త్యానుసారం తప్పకుండా సహాయపడాలి. సంయుక్తరాష్ట్రంలో వలెనే కొన్ని రాష్ట్రాలలో మాజీమంత్రులు (కాంగ్రెసు) కారాగారవిముక్తులైనారు. వీరునుయింకాయిప్పుడిప్పుడే చాలారాష్ట్రాలలో విడుదల అగుచున్న యితర కాంగ్రెసువాదులును, యింకయేపని చేయకున్నను, కనీసం వారివారి రాష్ట్రాలలోని ఆర్థిక అవసరాలనైనా పరిష్కరించడానికి శ్రద్ధవహించాలి. కేంద్రనిర్మాణసంస్థకు సంబంధించినంతవరకు, రాష్ట్రాలకు కావలసిన ఆర్థికసహాయంచేయడం ముఖ్యమైన వృత్తిగా వున్నది. ప్రణాళికలను, సూచనలను పంపుచు, వీటిని ఆచరణలో పెట్టుటకు కావలసిన సహాయాన్ని యివ్వలేకపోతే అది అసమర్థత్వం - యేదో మనవిధిని మనం నెరవేర్చామని సంతృప్తి చెందడం.

పనిని సృష్టించి యితరులచే పనిచేయించగల సమర్థవంతులగు ఆర్గనైజర్లు - నాయకులు లేని లోపాన్ని సవరించడం, యింకా కష్టసాధ్యమైనపని. మిగిలియున్న కొద్దిమంది వర్కర్లు సంచారాన్ని సాగిస్తూ, యితరవర్కర్లను కలసికొంటూ, ప్రత్యేకసమస్యలనుగూర్చి వారితో విచారణ జరుపుచు, సాధ్యమైనంతలో వారికి సలహాలను క్రమశిక్షణనుయివ్వడం కొంతకుకొంత పరిష్కారసాధన. విచిత్రమైన వాతావరణం మూలంగా మెచ్చుటనైనా కావల

సినదానికన్న మించిన సమర్థవంతులుఉన్నయెడల, వారిని తరుగుచోట్లకు, అసలే పూజ్యమైన స్థలాలకు పంపుటకు యేర్పాట్లు చేయాలి. క్రొత్తవర్కర్లను ముఖ్యంగా విద్యార్థివర్గాలలోనుండి చేకూర్చుకొను చుండవలెను. కారాగార విముక్తులైనవారిని వెంటనే దళాలలో చేర్చుకొనుచుండవలెను.

నిధులు - సమీకరణ — క్రమశిక్షణ — దొరకిన ప్రతిభను, అనుభవాన్ని తెలివిగా వుపయోగించుకొనుట; వీటి సమ్మేళనంమూలంగా నిర్మాణసంస్థ సమస్యలను పరిష్కరించవచ్చును.

నిర్దాక్షిణ్య ప్రతిబంధకాల మూలంగా చెక్కుచెదరకుండా నిర్మాణసంస్థను కాపాడడం పోరాటవిధులలో ఒకభాగం...ఒకభాగము మాత్రమేసుమా, మన నిర్మాణ సంస్థలోని ప్రతియూనిటుకు ప్రజలతో సంబంధముండాలి. సమరవీరులు—ప్రజలమధ్య సంబంధబంధాన్ని యేమాత్రం చెక్కుచెదరకుండా కాపాడాలి. ఒక్కమాటలో యీబంధం...ప్రచారం-మాటలతో, వ్రాతలతోగూడా ప్రచారం:—కరపత్రాలు, కరపుస్తకాలు, పోస్టర్లు, రేడియోవుపన్యాసాలు, దేశములో సమరవీరుల బృందాలయాత్రలు, ప్రజలను కలసికొని సాగించు చర్చలు వాఙ్మయం పంచిపెట్టడం, ఇంకోవిషయం; వ్రాయడం యెంతముఖ్యమో అచ్చువేయించడంకూడా అంత ముఖ్యమైన విషయం : ప్రతివిషయంలోకూడా సరిసమానమగు జాగ్రత్తతీసుకోవాలి. ప్రచారములోని వివిధశాఖలనుగూర్చి

కూడా జాగ్రత్తగా ఆలోచించాలి. విద్యార్థులు, కార్మికులు, షాపుయజమానులు, వ్యవసాయకూలీలు, మున్నగు వరిజలహృదయముల నాకర్షించుటయేగాక - పోలీసులు, సైనికులలోని క్రిందివర్గాలను కూడా ముఖ్యంగా గమనించాలి. విదేశ ప్రచారంకూడా, మన కార్యక్రమంలో ఒకభాగం.

ప్రచారమంటే యేదో ప్రచారమనుకోరాదు.— పోరాటంలో యిది ఒకభాగం. ఒక రేడియో కేంద్రాన్ని నడపడంగాని, "నిషేధ" కరపత్రాల్ని ప్రకటించడంగాని, మీటింగులు పెట్టకూడదన్నచోట సభలను యేర్పాటుచేయడంగాని, "నిషేధ"మున్నచోట తిరస్కరించడంగాని,— యిదంతా దోపిడీ అధికారానికి ఒక చెంపపెట్టు కాన, యిదిన్నీ వ్యతిరేక పోరాటంలో ఒక భాగం.

ఇంకా మనం యేమిచేయగలం? అంతర్జాతీయ పరిస్థితులలో యేదో మార్పురానిది రష్యా - జర్మనీ ఒడంబడిక, చీనా-జపాను శాంతి, బ్రిటిషుబలాలు పెద్ద దెబ్బ తినుట, యిండియా భూభాగంపై యుద్ధం ... యీ పెద్ద పనిని మనం సాధించలేము అని నాకు గట్టినమ్మకము న్నది గాన, యెవరేమనుకొన్నను బాహాటంగా చెప్పుటకు వెనుదీయను. ఇందువల్ల నిరుత్సాహపడ నవసరం లేదని మాత్రం సమరవీరులను కోరుచున్నాను. ప్రగతిశక్తులు శాగానే ఫలితముంటుందని ఆశలేసినారే పోరాటం సాగించి విజయంపొందగలరు. ఆతురుబాటు రంగంలో

స్థానం లేదు. తెలివిగా మహాత్ములను, రాజకీయ ధురీణులుగా వేషములు వేస్తున్నవారిని చరిత్రద్రోహులుగాను, గాఢతర నమ్మకము లేని నిర్వీర్యమైన శౌర్యముగలవారిగాను—త్యాగాలకు వెరచి తప్పుకొన్నవారిగాను చరిత్ర చిత్రిస్తుంది. నేడు మనశక్తి సాధ్యమైనంతవరకు సాగించు ప్రతిఘటన—సత్యాగ్రహం కానిండు, సమ్మెలుగానిండు, రహదారి సమానాయన నిర్మాణం గానిండు—వల్ల ప్రయోజనం లేదను అభిప్రాయంతో చాలామంది మిత్రులు నిరుత్సాహపడుతున్నారు. నిజం, దీనివల్ల చేకూరుబలం, బ్రిటిషు పాలనను నిలవేయగల్గినంత శక్తివంతమైనది కాదనుట నిక్కం. కాని చాల ముఖ్యావసరమైన యింకో దృష్టితో చూస్తే—ఇదిచాలా సుగుణమున్న ప్రచారము. ప్రజల ప్రతిభను నిలబెట్టుతుంది పెద్దసంఘటన రానున్నదను ఆశను నిలుపుతుంది—సమరవీరులకు క్రమశిక్షణ యిస్తుంది-పోరాటపు చిహ్నాలన్నీ ముద్రితములై యుండుట చేత, హంతమూర్ఖులకు తాను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనవని శత్రువును భంగారుపరుస్తుంది. ఫలప్రదమగు ప్రతిఘటనకు తయారు గావడానికి గొప్పసాధనము దృష్టిలో యిది యెంతో వుపయోగకరమైనది. ఏసిద్ధాంతము, ప్రణాళికపై మనకు నమ్మకమున్నను మనకు సాధ్యమైనంతవరకు కొదిగనో గొప్పగనో బ్రిటిషు అధికారంపై ప్రతిఘటన సాగించడంలో వెనుకాడరాదు.

నిర్మాణసంస్థ, ప్రచారము, చిల్లర ప్రతిఘటనలు వీటిని మన ప్రస్తుతపు కనీస ప్రణాళికభాగములుగా నేను

అంచనా వేసిపిలుస్తున్నాను. మీదుమిక్కిలి తయారుకావల సినశాఖలు చాలావున్నవి. విద్యార్థులు, కార్మికులలో పని ఆపగూడదు. సైన్యము, సర్వీసులలోని వారితో మన సంబంధాన్ని కాపాడుకొనుచు పెంపొందించు కొనుచుం డాలి. రహదారిసౌకర్య నిర్మూలనం సాగిపోతూవుండాలి. ఆగష్టుతొమ్మిదిన చెలరేగిన వుప్పెనవిధంగా, ఆ లక్ష ణాలతో భారీయెత్తున, మంచి నిర్మాణంతో, సరియగు నాయకత్వంతో కొనసాగించడం మన గమ్యస్థానపు ఆశయం. ఈ దారిన మనము వేసే ప్రతిఅడుగు గమ్యస్థా నపు దరిదాపులకు తీసుకు పోతూవుండాలి.

ఆహార విషయాన్నిగూర్చి ఒకమాట. దీని కల్లోల పరిస్థితినిగూర్చి నేను చెప్పనవసరమేలేదు. అది అందరకు తెలిసిన విషయమే: అందరు బాగా అర్థంచేసుకొన్నారు కూడా. స్వరాజ్యప్రభుత్వమే ఆహారవిషయ పరిష్కారా నికికూడా మార్గమనునదే బాగా అర్థం చేసుకోలేదు. వారి అసమర్థత, అయోగ్యతల మూలంగానే బ్రిటిషుపార్టీ యీసమస్యలను సృష్టించింది. వారు యిక్కడ నిలచి యున్నంత కాలం క్షామానికి గురికావడంకన్నా వేరు మార్గమేలేదు: కాబట్టి స్వాతంత్ర్యము కొరకు సాగించు పోరాటమే ఆహారాన్ని సాధించు పోరాటం. ఈమాట అని వూరుకోరాదు. స్వాతంత్ర్యపోరాటంలో ఒకభాగంగా ఆహార పోరాటాన్ని సాగించవలసివుంది. ఈ పరిస్థితులలో, ఆహారసమస్యకు జవాబుగా ప్రజలు దానధర్మాలపై ఆధారపడుచున్నారు. వర్గభేదా లనునది సంఘంలో

వుంటేనే దాతృత్వమనేది పుట్టింది. సామ్యవాదిని గాన దీనిని విపరీతంగా ద్వేషించుచున్నాను. కాని ప్రస్తుతావస్థలో, క్షుద్బాధతో మరణశయ్యలపైనున్న ప్రజలకు భూతదయా పరతంత్రతతో సహాయముచేయ ముందుకువచ్చినవారిని గౌరవించుచున్నాను ఇదిచెప్పాలో తగ్గ ప్రజోపయోగకరణమేగాని, దీని అంతానికి దాతృత్వము మాత్రమే సాధనంగాదు. ఇది సమస్యను పరిష్కరించలేదు. క్షామపీడితులను కడుపుకాలువారిని కలసికొని, వారిలో ద్వేషము, ఆగ్రహము పెంపొందునట్లు చేయుట యీ పరిస్థితులలో ముఖ్యమైనపనిగాన సమరవీరులు దీనిని సాధించవలెను. ఈ క్షోభకంతకు మూలకారణమైనపరదేశప్రభుత్వముపైకి యీప్రవాహాన్నంతా మరల్చాలి, సాధారణపరిస్థితులలో బ్రిటిషుపాలనమును నిర్వీర్యముచేయు పరిస్థితులను క్షామపీడితులు కల్పించవలెను. ఎక్కడ ఆహారమున్నదో అక్కడ వశపరచుకోవాలని వారికి చెప్పాలి, చెప్పడమేకాదు చేయడంలోకూడా సహాయపడాలి. పల్లెప్రాంతాలలో గ్రామాలు దాటి ఆహారంపోకుండా చూచుచు, గ్రామపంచాయితీలు, యింకా యితరసంస్థలు స్థాపించి వాటి మూలంగా నిల్వలను సక్రమంగాపంచుటకు యేర్పాటుచేయవలెను. (ప్రభుత్వంగాని, ప్రభుత్వం సానుభూతిపరులనుగూర్చి జాగ్రత్త తీసుకోవాలి) సమరవీరులు, క్రమశిక్షణపొందిన గొరిల్లాలు ప్రభుత్వడిపోలు ఆ సంబంధమైన నిలయాల నుండి, ధాన్యాన్ని వశపరచుకొని, ఆకలిమంటలతో

అలమటిస్తున్న ప్రజలకు పంచిపెట్టాలి, బలవంతంగా పంటలు, ధాన్యాన్ని ప్రభుత్వం వశపరచుకొనునప్పుడు ప్రతిఘటించితీరాలి. నగరాలు పట్టణాలలోకూడా నిరాశ నిస్పృహలకు లోనైన విద్యాధికులను, అన్నార్తులను, మేల్కొల్పి ద్వేషాన్ని పోషిస్తున్న రేకొల్పి చురుకైన ప్రదర్శనాలు బహిరంగ ప్రతిఘటనకు ఉద్యుక్తులను చెయ్యాలి. తరచుగా సమావేశాలు నన్ను కార్యక్రమం చూపమని అడుగుచున్నారు. ప్రాతికన్న మేలైన కార్యక్రమం యేముంది? ఆలోచించి ధైర్యంగా పూనుకొంటే, దేశాన్ని కళపెళ్లా పులకించి సామ్రాజ్యాన్ని పిప్పి పిప్పి అగునట్లు పడగొట్టి వేయవచ్చును.

నిర్మాణసంస్థనుగూర్చి మాట్లాడునపుడు కాంగ్రెసునుగురించి మాత్రమే చెప్పాను. కాంగ్రెసు ఆశయాలు హద్దులను అధిగమించి పోవువారికి సహజంగా ప్రత్యేక కార్యక్రమంగల ప్రత్యేకపు నిర్మాణసంస్థ యుండవలెను. ఇట్టివారికి గొరిల్లా విధానమునకు సంబంధించిన నిర్మాణ సంస్థను యేర్పరచమని సలహానిచ్చాను. గొరిల్లా ఉద్యమాన్ని అభివృద్ధిపరుచుటలో అప్పుడే చురుకుగా చాలా పని సాగిపోవుచున్నది. ఈ ప్రస్తుతమున్న వాతావరణాన్ని గమనించి యీ విషయానికి చెందిన పూర్తివివరాలను యెరుకపరచుతారని ఆశించను. కాని ఒక్కసంగతి, సరియగు కేంద్రాలకు యెప్పటికిప్పుడు దీనికి సంబంధించిన నా అభిప్రాయాలను పంపడానికి అట్టే కష్టమేమీలేదు. కాని యీ విషయంలో విపరీత ఆసక్తి యున్నవారు,

యిదివరకే స్థాపింపబడిన నిర్మాణసంస్థతో ప్రప్రథమంలో సంబంధం యేర్పరుచుకోవడం మాత్రం బహు కష్టసాధ్యమైన పని.

ఈ వాక్యాలతో సహచరులారా, నేను ముగిస్తున్నాను. బాగా ఆలోచించి ప్రస్తుత వాతావరణాన్ని విపులీకరించాను. అతిశయోక్తులు, పదాడంబరాలు లేకుండా నా వ్యూహాలు మీ ముందుపుంచాను. వీటిలో యేది స్వీకరణయోగ్యమైందో మీకు మీరే నిర్ణయించుకోవాలి. ఎప్పుడు మీ ఆజ్ఞలకు బాసటై నిలుస్తాను. మీకువలెనే నాకును "కరేంగే యా మరేంగే" యే ముఖ్యాని. కాబట్టి మనం చేయనైనా చేయాలి, చావనైనా చావాలి.

ఇండియాలో యెక్కడనో
1 సెప్టెంబరు, 1943.

జయప్రకాశనారాయణ.

# స్వాతంత్ర్య సమర వీరులకు సుస్వాగతము

సహచరులారా!

ముఖాముఖి మిమ్ము ప్రబోధించుటకు మరల అవకాశము దొరికినందులకు సంతోషిస్తున్నాను. మిమ్ము కలుసుకోడానికి, సర్వ సన్నద్ధంగా, "జనతా" తోడ్పడి నందులకు అభినందిస్తున్నాను.

స్వాతంత్ర్య సమరవీరులలో ధైర్యానికి, ఔన్నత్యానికి అందెవేసిన చేయియై, సాటిలేని మేటి సహచరురాలైన స్వర్గస్థురాలగు సత్యవతీదేవికి నాసానుభూతిని ప్రప్రథమమున తెల్పుచున్నాను. ఆమెనగరమగు, ఢిల్లీ ప్రజలు కొంతకాలముక్రిందట ఆమెస్మారక చిహ్నంగా ఒక శిలా విగ్రహాన్ని స్థాపింప నిశ్చయించుకొన్నారు. దీన్ని త్వరగా స్థాపించినట్లైనచో; కార్మిక కర్షకుల సేవయే తన జీవిత పరమావధిగా నెంచిన యీమెకు తమ కృతజ్ఞత తెలియ జేసికొన్నట్లగునని నా అభిప్రాయము.

కొద్దిరోజులేగదా నేను జైలుగేటునుదాటి; కాన నేను చెప్పగల్గింది విశేషంగా యేమీలేదు. కాని నా అభివందనాలను, ఆశీస్సులను మీకు అందజేయుటకు యీ అవకాశాన్ని వుపయోగించుకొను చున్నాను. పరిస్థితులను కూలంకషంగా అర్థంచేసుకొని, నా నాయకులతోను సహచరులతోను సంప్రదించి; ఆతర్వాత సమగ్రంగా నా అభి

ప్రాయాలను మీ ముందుంచి, యేది యేవిధంగా చేయాలో సూచిస్తాను.

దేశనాయకులు - బ్రిటిష్ప్రభుత్వ సర్వాధికారుల మధ్య సాగుచున్న సంప్రదింపులగూర్చి మీలో కొంత మంది భయోత్పాతములతో, విసికి వేసారి యుండుటకు అవకాశముంది. ఈ విధముగా లొంగిపోయినచో మన కర్తవ్యాన్ని, కార్యక్రమాన్ని కొనసాగించలేము. మన జాగరూగతను; శక్తిసామర్థ్యాలను కోరుచున్న విధులు యింకా చాలావున్నాయి. అవేమిటో మీకు తెలుసు; వాటినిగురించి అనతికాలంలోనే యింకా విపులంగా మీకు విశదపరుస్తాను ఇంతవరకును బ్రిటిష వారు యిండియానుండి వైతొలగిపోలేదు. ఇది యీవిధంగా నున్నంత కాలము; యితర యేవిషయాలను పాటించక క్రమపద్ధతిని పురోగమనాన్ని సాగించుటకు వలసిన కార్యక్రమాన్ని గూర్చి శ్రద్ధవహించి, అవసరమైతే; యెప్పుడు దాన్ని వుపయోగించుటకు సమయంవస్తే అప్పుడు సాగించితీరాలి. ఈ ఫలసిద్ధికి, ప్రశాంతంగా అమితజాగరూకతతో పన్నిన కార్యక్రమ వ్యూహాన్ని నిర్మించుకోటే నేటి మనవిధి. ప్రాణముపోక గిజగిజలాడుచున్న బ్రిటిషుఅధికారము మనదేశాన్నుంచి వెడలిపోవు నంతవరకు యీ పట్టుదలను విడనాడకూడదు.

జై హింద్ !

డిల్లీ
15, ఏప్రియల్ 1946. } జయప్రకాశనారాయణ.

# స్వాతంత్ర్య సమరవీరులకు

## మూడవ లేఖ

సహచరులారా!

జైలుగేటు దాటగానే, జనతామూలంగా నా అభినందనలను తెలియజేస్తూ, ప్రస్తుత పరిస్థితులనుగూర్చియు మనము నిర్వహింపవలసిన విధులనుగూర్చియు కొద్ది విరామంలో నాఅభిప్రాయాలనుమీాముందు వుంచుతానని వూచీపడ్డాను. ఈబాధ్యతను నెరవేర్చుటకు చాల కాలయాపన జరిగినందులకు క్షమించాలి, తోటి సహచరుల కలసికొని విచారించడము ముఖ్యం గనుక కాలవ్యవధి తప్పనిసరైంది. ఈ పనిని పూర్తిచేశాను. కొంతకుకొంత ఖచ్చితంగా నిర్వచించడానికి యిప్పుడుఫరవాలేదు.

ముఖ్యమైన సమస్యలు ఉత్పన్నమైనపుడు, యెప్పటికప్పుడు మా అభిప్రాయాలను విశదపరచుటకు, నేను, నా సన్నిహిత సహచరులు, వీలునుబట్టి కలసి ఒక్కటిగా గాని, ప్రత్యేకంగాగాని, ప్రయత్నించాము. అఖిలభారత కాంగ్రెసులో మన దృక్పథాన్నిగూర్చి కూలంకషంగా అర్థంచేసుకొనే వుంటారు. ఇంకా పరిపూర్ణంగా క్రమపద్ధతిలో నా అభిప్రాయాలను–నా సహచరుల అభిప్రాయాలనుగూడా–మీాముందువుంచి, ప్రస్తుత పరిస్థితుల విశదీకరించి, వీటిని యెదుర్కొని సాధించడానికి మనము అనుసరించవలసిన పద్ధతులనుగూర్చి యెరుకపరుస్తాను.

ఈ ప్రస్తుతవాతావరణం విరామకాలం, ఉధృతంగా పరిస్థితులు దూసుకుపోతున్నాయి. బ్రిటనుసృష్టించిన

రాజ్యాంగ నిర్మాణసంస్థలో కాంగ్రెసు పాల్గొనడానికి అఖిలభారతకాంగ్రెసు సంఘం అనుమతియిచ్చింది. అనతి కాలంలోనే బ్రిటిషు వైస్రాయి ఆధ్వర్యాన తాత్కాలిక ప్రభుత్వం ఆచరణలోకి వస్తుందికూడా నేమో. ఎప్పుడు యీప్రభుత్వం ఆచరణలోనికి వచ్చినను, బ్రిటిషువైస్రాయి బ్రిటిషు సాయుధబలాలు, తెల్లదొరలు మన దేశాన్ని దాటిపోనంతవరకు, దీనిని స్వాతంత్ర్య దేశముయొక్క స్వాతంత్ర్యప్రభుత్వముగ పిలువడానికి వీల్లేదు. ఈ ప్రభుత్వాన్నే స్వాతంత్ర్యప్రభుత్వంగా మననివ్వండని ప్రాధేయపడటం మొద్దును బట్టుకొని శివాలాడడం. వారిచిత్తానుసారం యెడమచేత్తో అధికారమిచ్చుటకు బలమున్న వారికి, వారికే మరలా మనసొచ్చినపుడు కుడిచేతితో కైంకర్యం చేయడానికికూడా అధికారముంది. కాబట్టి యీ "అధికారములో" నున్న తాత్కాలికపు ప్రభుత్వమే, భారత దేశపు స్వాతంత్ర్యప్రభుత్వమను దుష్ప్రచారములో మనము తగుల్కొనకూడదు,

ఈ పరిస్థితిలోని రాజ్యాంగ నిర్మాణసభవల్ల మనకు స్వరాజ్యం ప్రాప్తిస్తుందా? నూటిప్రశ్న అడగాలంటే, యిండియా స్వాతంత్ర్య రిపబ్లికు అని ప్రకటించి, ఆప్రకటనను యీ నిర్మాణసభ ఆచరణలో పెట్టగలదా? ఉదాహరణకు చెప్పుచున్నాను, తాత్కాలికప్రభుత్వాన్ని యేర్పరచి, నిర్బంధంగానైనా వైస్రాయినుండి అధికారమును గుంజుకొని, దేశమునుండి సాగనంపగలదా? బ్రిటిషు సైనికబలాలను, సివిలు అధికారులను,మూటా

ముల్లెలతో కూడా దేశాన్ని వెడల నడిపింపగలశక్తి యీతాత్కాలిక ప్రభుత్వానికి వుంటుందా? దేశపురుషత్తుకను ఉచ్చువేసి బిగించిన బ్రిటిషు ఆర్థికవిధానాన్ని ఖండ ఖండములుగా నరికిపారవేయగలదా? ఈ విధంగా బ్రిటిషు వారిని దేశాన్ని దాటగొట్టి, సర్వాధికారాలు తాత్కాలికప్రభుత్వం చేతిలోబెట్టి, తన్ను తానే రద్దుచేసుకొని, ఏ ప్రతిబంధకాలులేని వయోజన ఓటింగువిధానము ప్రకారము యెన్నుకోబడిన నిజమగు రాజ్యాంగనిర్మాణసభను యేర్పాటు చేయగలదా? ఇండియాను స్వాతంత్ర్య దేశముగాను, ప్రజాస్వామ్య దేశముగాను మనునట్లుజేయుటకు ముఖ్యావసరమైన యీకార్యకలాపాన్ని రంగంలోకి దిగనున్న యీరాజ్యాంగనిర్మాణసభ చక్కబెట్టగలదా? నేటి వాతావరణాన్ని, యీశక్తుల పరస్పరసంబంధాన్ని గమనించి ఆలోచించినచో, యిందు యేమార్గాన్ని గాని అనుసరించి యేకార్యభారాన్ని గాని యీ రాజ్యాంగనిర్వహాణసభ యీడేర్చ గలదని తలచడం శుద్ధ అవివేకం. ఒకవేళ యీనిర్వహాణసభ యీప్రయత్నానికి సన్నద్ధమైనదని తలచినా, వెన్వెంటనే బ్రిటిషుప్రభుత్వము ఒక గొడ్డలిపెట్టుపెట్టగలదని ఊహించగలం. అప్పుడుయీబ్రిటిషు సవాలుకు తలయొగ్గక లుచొని, యీఅసెంబ్లితన నిజాయితీని ఆత్మగౌరవాన్ని నిలుపుకోదలచినచో ప్రజాఅనుమతిని బొంది తన కృతనిశ్చయాన్ని నిండుఅధికారంతో ఆచరణలోబెట్టి తీరాలి. ఎసెంబ్లీని సమాయత్తపరచడానికి యిన్ని హంగుహోమాలుచేసిన వైస్రాయి, యింతటితో

తనంతట తానే అంత్యక్రియలు చేయడానికి తయారౌ తాడు. ఈఘట్టమే స్వాతంత్ర్యసాధనకు చివరంట సాగించు అంతిమ యుద్ధానికి ప్రాతిపదిక. దీనిలో నుండే నిజమగు ప్రజలప్రాతినిధ్యము వహించగలుగు రాజ్యాంగ నిర్వాహణ సభ యేర్పడి, స్వాతంత్ర్య ప్రజాస్వామ్య ప్రతిబింబమగు, యిండియా సంయుక్త రిపబ్లికు యేర్పరిచి తీరుతుంది.

కారణమేదైననుయీరాజ్యాంగనిర్వాహణసభ యీ అడుగుజాడల ననుసరించు లక్షణాలు యేమీ కనుపించుట లేదు. ఇదంతా పరిస్థితుల ప్రోద్బలమని అధ్యక్షుడు జహ్వారే విశదీకరించాడుగదా. దీన్ని మూలంగా చేసుకొని, అధికారము ముఖ్యమని గుర్తెరింగి, బలహీనతలను గమనించి, రాహుకేతువులవలె లోనచేరిన స్వాతంత్ర్యానికి, ప్రజాస్వామ్యానికి పరమ శత్రువులగు బ్రిటిషుగులాముల కనిపెట్టి, కండ్లముందు బ్రిటీషుసైన్యము, బ్రిటిషు వైస్రాయిలను గమనిస్తూ, యివేగాక యింకా అనేకములగు సైంధవులను అర్థముచేసుకొని, రాజ్యాంగ నిర్వాహణసభ సమగ్రంగా నేను చిత్రించిందే ఋజుమార్గమని, ఆదారినే సాగిపోవుటకు అంగీకరించవచ్చును. ఇది కాదనుము. రాజీ చెదరగనే యింకోరాజీకి అఱ్ఱులుజాచుటకు నిశ్చయించుకొనియుండవచ్చును. ఇందువల్ల చివరకు స్వాతంత్ర్యాన్ని గాని,ప్రజాస్వామ్యాన్నిగాని,జాతీయఐక్యతనుగాని సాధించలేము. అంతట విసిగి,పరాభవమును బొందిన దేశము పొరబడి తప్పుదారిని పడితినని తెలిసికొని సక్రమమార్గమునకు తిరిగి వచ్చును. ఈమార్గమే విప్లవానికి సన్నద్ధపరుస్తుంది.

ఈమార్గమే ప్రతిఘటనకు పోరాటానికి దారితీస్తుంది. ఈ మార్గం బహుకష్టతరమైన మార్గంకాని స్వాతంత్ర్యసాధనకు యిది ఒక్కటే మార్గం.

కాన రాజ్యాంగ నిర్వహణసభ "ఫలప్రదము" గానిండు "ఫలశూన్యత" పొందనిండు. స్వాతంత్ర్య నము పార్జనకు పోరాటము తప్పనిసరని మనము గమనింప గలిగితిమి మన దేశములోని ప్రస్తుతశక్తుల పరస్పర సంబంధాన్ని ఖచ్చితంగా గ్రహించిన ప్రతివాదును, సునాయాసంగా యీ నిశ్చితాభిప్రాయాన్ని అంగీకరిస్తాడు. మనపైకి "పరిస్థితుల పోద్బల"పరిచి యెదిరించి నిలువరించడానికి యీ నాటికికూడా బ్రిటిషుసామ్రాజ్యతత్వానికి సాధ్యమగుచున్నది. విప్లవముఖమున యీ ప్రోద్బలాన్ని కృంగద్రొక్కనంతవరకు స్వాతంత్ర్యము గాలిలోని వార్త. వాదమువల్ల బిచ్చమెత్తుటవల్ల, రాజకీయ కుతంత్రాలవల్ల ప్రస్తుత వాతావరణ వాస్తవస్థితిని మార్చగలమని యెవ్వరు అంగీకరింపజాలరు.

కాబట్టి బ్రిటిషురాజ్యాంగసూచనలను అంగీకరించినంతనే, స్వాతంత్ర్యమునకు సాగించవలసిన పోరాటము ఆగిపోదని–దీన్ని మనం జపిస్తుండాలి–మనం స్థిరసంకల్పులమైనాం. పోరాటం సాగుతూనే వుంటుంది. తరచి చూస్తే పోరాటపుప్రవేళ్ళు లోనికి పాకిపోయి, విశాల భూభాగాన్ని ఆక్రమించుచు, శీలాన్ని ఆవశ్యకతను అభివృద్ధి చేసుకొనుచున్నట్లు గమనింపగలం. స్వేచ్ఛకై సాగించు పోరాటానికి; జాతీయఐక్యతకు, దుర్భిక్షు నిర్మూలనానికి సాగించు పోరాటాలు వచ్చి కలసినపోయితివి.

# సమిష్టి పోరాటం

బ్రిటిషు సూచనలు అంగీకరించడంతో జాతీయ విచ్ఛిన్నానికి అనేకశక్తులు తారసిల్లి కమ్ముకొనివస్తాయి. దేశంలో ఐక్యత నెలకొల్పి రాజకీయంగా యిండియాకు బ్రిటిషువారు చాల గొప్ప మేలుచేశారని సర్వసామాన్యంగా ఊహిస్తున్నారు. నేడు అవి వేరులై యీ ఘన కార్యచిహ్నమగు స్థూపాన్ని వారిచేతులతో వారే విరుగగొట్టుటకు సన్నద్ధమైనారే యని వాపోవుచున్నారు. ఇంతకన్నా మూఢత్వాన్ని నిరూపించే అభిప్రాయం యింకొకటి వుండదు. ఇండియాలో ఐక్యత నెలకొల్పుటకుమారు, బ్రిటిషువారు, వారి సర్వసామర్థ్యాలను వుపయోగించి భిన్నబిన్నాలుగా విడగొట్టారు. హిందువులకు మహమ్మదీయులకు పొత్తు చెడగొట్టారు. మరల హిందువులలోనుండి హరిజనుల విభాగించారు. సిక్కులను ప్రత్యేక అల్పసంఖ్యాకులుగా తేల్చివేశారు. సంస్థానాలను మిగతాదేశమునుండి విడగొట్టారు. సంస్థానాధీశులకు ప్రజలకు విరోధము కల్పించారు. జమీందారుల సృష్టించి బ్రిటిషుపాలనకు స్థూపాలగా స్థాపించివేశారు. పెట్టుబడిదారులకు మధ్యతరగతివారికి లంచాలనుమేపి, దేశానికి పరమ శత్రువులుగా పరిణమింపజేశారు. ఇదం తాగమనించి చూస్తే వంద సంవత్సరములనుండి దేశాన్ని పాలిస్తు, బ్రిటిషుపాలనను చివరకు యేమాత్రం బలహీనపరచినను దేశంలో భీభత్సం చెలరేగి ముక్కలు

ముక్కలై పోతుందేమోనను భయోత్పాతముల గల్పించ గల్గునంతటి సుఖవాతావరణాన్ని సృష్టించుకొనగలిగిరి. బ్రిటిషుపాలనవల్ల ప్రజలలోను, దేశములోను యేర్పడిన ఐక్యత, సంఘీభావములు పూజ్యం. నిరంకుశపాలన మాత్రం బలపడి సంఘీభావాన్ని నెలకొల్పుకొన్నది. కాంగ్రెసుమాత్రం పాటుబడి ప్రజలయందు సంఘీభావాన్ని నెలకొల్పగల్గింది. అదియును యిప్పుడు ప్రమాదావస్థలో వుంది. కాబట్టి బ్రిటిషుసూచనల అంగీకరించగనే, జాతీయ ఐక్యతకు సాగవలసిన పోరాటం ఒకప్రత్యేక ప్రాముఖ్యానికి వస్తుంది.

రెండోది; రానున్న రాజ్యాంగమార్పులవల్ల ఆర్థిక, వర్గ సమస్యలు ప్రథమ పీఠాన్ని అధిష్ఠిస్తాయి. స్వరాజ్య రూపమేమిటి, "స్వరాజ్యమెవరికి" అనుప్రశ్నలు ముందుకువస్తాయి. బలములేని మారుమూలల సమస్యగా యింక యివి యేమాత్రం వుండవు, త్వరితంగా క్షణాల్లో పరిష్కరింపబడ వలసినంత ప్రాముఖ్యాన్ని వహించి, వెన్వెంటనే జవాబుకై పట్టుబడతాయి. మాటలనుమాని కార్యరూపేణ మన రాజకీయాలను నిలవేసితీరుతవి. కాబట్టి ఆహారానికై సాగుపోరాటం, స్వాతంత్ర్య పోరాటంలో ఒక ముఖ్యమైన భాగమైపోతుంది. ఈ రెండును ప్రథమ శ్రేణిని నిలచి, ఒకదానికి ఒకటి యీడువోని ప్రాముఖ్యాన్ని గడించుతవి.

ఈమూడను, మూడు ప్రత్యేక పోరాటాలు గాక, ఒకే ప్రజా సముష్టిపోరాటంలో భాగాలు, అంచెలుగా

వున్నవని విశదీకరించి, రుజువుపరచుకున్నాను. వివిధావస్థలలో ఒకటియొక్క వప్రాముఖ్యాన్ని, వేరొకటి తక్కువ ప్రాముఖ్యాన్ని పొందవచ్చును. కాని యీ ప్రస్తుత రాజ్యాంగపథకాలు కాలూనుకోలదు, యివన్నియు ఒకే సమున్నతస్థాయిలోకి వస్తాయి.

ఈ పరిస్థితులబట్టి, ప్రజల సమిష్టిపోరాటము, తొలుత రాజ్యాంగ నిర్వహణసభతో, ఆతర్వాత బహుశా తాత్కాలిక ప్రభుత్వంతో, వెన్వెంటనే సంయుక్త ప్రభుత్వంతో లేదా గ్రూపు, రాష్ట్రీయప్రభుత్వాలతో తల పడవలసివస్తుంది.

మన మొక భాగంగావున్న కాంగ్రెసు, యీ అన్ని పరిణామాలతో సంబంధముంచుకొనే అవకాశా లున్నవి. ఈ పోకడను గమనిస్తే, స్వేచ్ఛకు, ఐక్యతకు, ఆహారానికి, కాంగ్రెసు సాగించవలసిన పోరాటం—ఆ వుద్దేశ్యముంచేనే లెండి-రాజ్యాంగకలాపము, ప్రభుత్వపుయంత్రంమూలంగా నడుస్తుందన్నమాట. అప్పుడే పార్లమెంటరీ విధానానికి కాంగ్రెసు దోసిలొగ్గింది. ఈ చిలువలే చివరంటసాగినచో, ఈ త్రిముఖ పోరాటంలో కాంగ్రెసు యేవిధమైన అభివృద్ధిని సాధించలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. కొన్ని పరిస్థితులలో యీ రాజ్యాంగచట్టములు, పరిపాలనాయంత్రముల మూలమున యెక్కడనైనా సుగుణములు కనిపించవచ్చునేమోగాని, నేడు మనమున్న వాతావరణాన్ని పోల్చిచూస్తే యీ యసెంబ్లివాకిళ్ళకు, ప్రభుత్వ

శాఖల గుమాస్తాలకు సాగిలపడినందువల్ల ప్రజాపోరాటానికి, యెట్టి ప్రయోజనము చేకూరగదని తెల్పుకోవచ్చును.

# 2

## ప్ర జా ఆ ద ర ణ

ఏవిధంగా యీ పోరాటానికి తలపడాలి? భీషణము గనా? పొందికలేని హింసవల్లనా? దోపిడీలమూలంగానా? దగ్ధవిధానంమూలంగానా? సుస్పష్టమేగదా, కాదు. ఈ పరిస్థితులలో ప్రజాఆదరణ పొంది, ఆ తర్వాత పోరాటం సాగించటమే సుగమమార్గం. మానసికంగా ప్రజలను, పోరాటానికి సమాయత్తపరచుట, రైతుకూలి, కార్మిక సంస్థల పునర్నిర్మించుట, వాలంటీరుదళాలు, విద్యార్థి, యువకసంస్థలను ప్రోత్సహించుట, గ్రామ స్వపరిపాలనము, చేనేత సహకారసంస్థలను నెలకొల్పుట, ప్రజల సమిష్టిబలాన్ని కూడగట్టి, అప్రమత్తులు గాకుండా చేయుగల్గు యింకా అనేకవిధములైన సంస్థలకు చేయూతనిచ్చుట మూలంగానే మనము ప్రజాదరణను పొందగలము. ఇదిగాక, కాంగ్రెసుసంస్థకు బలము చేకూర్చుచు, ఉత్సాహాన్ని పెంపొందించుచు, ప్రజలకుదీనితో సన్నిహిత సంబంధాన్ని సాధించుచు, అప్రమత్తులము గాక సర్వ బాధ్యతలను నెరవేర్చినచో ప్రజాఆదరణ యినుమడిస్తుంది. ప్రస్తుత ఘట్టంలో మన పోరాటానికి సంబంధించినంతవరకు సుముఖంగా ప్రజాదరణ పెంపొందించు

టకు వలసిన పథకాన్ని ముందుముందు కార్యక్రమ మను భాగంక్రింద సువిదితపరుస్తాను.

జాతీయఐక్యత యను దృక్పథంతో పోల్చిచూస్తే యీ "ప్రజా ఆదరణ" అను పదమునకున్న అర్థాన్ని వర్తమంగా యిచ్చుట తెలియజేస్తాను. పైనుండి బలవంతవు మూఘుస్నానంగా నెత్తినరుద్దునదిగాదు . యీ జాతీయ ఐక్యత. దీన్ని అడుగునుండి గట్టిపునాదితో నిర్మించుకుంటూ రావలెను. ఏ విధంగా యీ ఐక్యతను నిర్మించుకుంటూ రావలెను? ఓపిక పట్టుదలలతో ముస్లిములలో రాజకీయకార్యక్రమాన్ని సాగిస్తూ, ఆర్థిక వర్గ సంస్థలకు బలమును చేకూర్చుచూ,—కిసానుసభలు, చేనేత సహకారసంస్థలు మున్నగునవి,సమిష్టివిజ్ఞానమునకు వినోదములకు హిందువులలో ఆసక్తి కల్పించి, సాంఘిక సంస్కరణాలకు సుముఖులజేయుట,సంఘంలో సహజంగా జాతీయఐక్యతకు చేయూతనొసగు శక్తులబలపరచుట— బలవత్తరమగు సరిహద్దుయేర్పాటు, ఆర్థికఅభివృద్ధికి, సమిష్టిసహకారము చేకూర్చుట, సమిష్టి ఆర్థికవ్యవస్థ నెలకొల్పుట, దేశభావనభివృద్ధిపరచుట మున్నగు కార్యక్రమములు యిందులోని భాగములు. అసలు ముఖ్యంగా నొక్కి చెప్పవలసిన విషయం యింకొకటున్నది. ప్రతి స్వాతంత్ర్యయోధుడుగూడా కుల మత బేధాలకు యీమాత్రం తావీయకూడదు. ఈ దురహంకారాన్ని పారద్రోలి, తన స్వజీవితంలో, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని పెంపొందించుకోవాలి.

జాతీయ ఐక్యతకు కావలసిన ప్రజాదరణ చాల దుర్బలావస్థలోవుంది, దీని అభివృద్ధికి పాటుబడడం, మన ప్రస్తుత కార్యాచరణలో ప్రముఖ స్థానాన్ని అలంకరించాలి.

ప్రజాదరణ సాధనకు, సంకుచితంగా ప్రత్యేక ప్రత్యేకంగా జరుగు ప్రయత్నాలు సుతరాం పనికిరావు. ఒకదానికి ఒకటి సంబంధంలేకుండా ప్రతిదానికి వేరు వేరుగా ప్రజాదరణను సేకరించడం అసలేగిట్టదు. దురభిప్రాయాలకు తావులేకుండా దీనిని తేల్చి చెప్పాచున్నాను. రాజకీయ ఆర్థిక, సాంఘిక ఆదరణాలు అభేద్యమై టంకానికి బంగారమతికినట్లు ఒకదానికొకటి చేయూతనిచ్చుచు, మహత్తరమగు ప్రజాఉద్యమంలో ఒకభాగంగా లీనమైపోవలెను.

## 3

## నిర్మాణసంస్థ సమస్య

ప్రస్తుత మన కార్యాచరణకు, సమగ్రమగు కార్యక్రమమునుగూర్చి విశదపరచుటకుముందు, నేడు స్వాతంత్ర్య సమరవీరులుకలసి పనిచేయుటకు వుండవలసిన నిర్మాణసంస్థయొక్క రూపాన్నిగురించి బోధపరచుట ముఖ్యావసరము ఈ నా అభిప్రాయాలతో, నా సన్నిహిత సహచరులు దాదాపు అందరు యేకీభవిస్తున్నారని తెలియజేయుటకు సంతోషిస్తున్నాను. ఆగస్టు విప్లవ

దినాల్లో మనమందరము కాంగ్రెసు పేరుతోనే పాటుబడుతూ వచ్చాము ఆ రోజుల్లో కాంగ్రెసు మొత్తము పోరాటానికి సమాయత్తమైనది కాబట్టి, ఆవిధంగా నిర్వహించడానికి అవకాశమేర్పడింది. పోరాటానికి దూరంగా నున్నట్టిగాని వ్యతిరేకించినట్టిగాని ప్రతి కాంగ్రెసువాదియు కూడా కాంగ్రెసునే వ్యతిరేకించి ద్రోహాన్ని చేసినవాడుగా పరిగణింపబడ్డాడు. ఈనాటి పరిస్థితులు వేరు. ఈనాటి కాంగ్రెసు అధికారపూర్వకపు విధానము, పోరాటానికిగాని పోరాటమునకు సర్వసన్నద్ధమగుటకుగాని సుముఖంగా లేదు. రాజీలకు, పార్లమెంటరీవిధానాలకు దిగజారిపోయింది. కాబట్టి, యీనాటికికూడా పోరాటవిధానానికి కట్టుబడి. విప్లవాన్ని సాధించాలని పట్టుబట్టియున్న మనబోటివారు, కాంగ్రెసు పేరుతో కార్యకలాపాన్ని సాగించుటకు వీల్లేదు.

కాని యింకో సంగతి, ఈనాడు కాంగ్రెసునువదలివేసి, ప్రత్యర్థిగా యింకో ప్రజానిర్మాణసంస్థను నెలకొల్పడం, మన దేశంలో స్వాతంత్ర్య సాధనకుసాగు ఉపక్రమణకు ఘోరమైన అన్యాయాన్ని, మహత్తరమైన విపత్తును గల్పించినట్లు. ఇది నా దృఢవిశ్వాసం. ప్రస్తుత కాంగ్రెసు నాయకత్వం అనుసరించు విధానానికి, మనం అనుసరించు విధానానికి, యేవిధంగాను సంబంధము లేదనునది తేటతెల్లమైన విషయం. కాని సంస్థయొక్క విధానానికి, నాయకత్వానికి యెట్టిపొందికయు లేదు. ఏ ముఠాకుగాని యీడువోని మీ మహత్తరత్యాగాలు, సాధకబాధలు

కూడా నేడు కాంగ్రెసుకు అండమైనిలచినవి. కాన కాంగ్రెసు పేరుతో మాట్లాడుటకు, యితరులకున్నంత అధికారము నీకువుంది. దేశములోని జాతీయ సాంఘికశక్తులకు ప్రతిరూపమే కాంగ్రెసు. ప్రజల మానసిక ప్రవృత్తిపై యేనాడు కనివినియెరుగని అనన్య సామాన్యమైన పలుకుబడికి కాంగ్రెసు ప్రాతినిధ్యం వహిస్తున్నది. కాన ప్రజా పోరాటానికి యిది సరియగు నిశ్చితమైన ఆయుధం. విప్లవవిధానానికి దీనిని వుపయోగించుకొనుటకు ఆస్కారమున్నన్ని నాళ్ళు యీ ఆయుధం వదలివేయుట తెలివిమాలినపని. ఈ అవకాశం యీ నాటికికూడా వుందని నానమ్మకం. కాబట్టి కాంగ్రెసులోవుండి పని జేయుచు సర్వస్వాన్ని ఒడ్డి కాంగ్రెసును బలపరచుచు, చురుకైన కార్యక్రమంతో ప్రజాసేవతో కాంగ్రెసునే మన దృక్పథానికి మార్చుకొనుటకు పాటుబడాలి. ఇది నా ఆత్మవిశ్వాసం. ప్రజాసేవకుగాని, పాలనకు గాని, పూర్తిగా ప్రభుత్వయంత్రంపైననే ఆధారపడుచు, రోజు రోజునకు నిరంకుశత్వానికి వన్నెదిద్దుచు, వుద్యోగవర్గ సంరక్షణానికిపూనుకొన్నుచున్నట్లు కాంగ్రెసు సంస్థపైనున్న పలుకుబడిని కాపాడుకొనుచు నిర్మాణ కార్యక్రమాన్ని పూర్తిగావదలవేసి, పార్లమెంటరీ విధానాన్నే కాంగ్రెసు అనుసరించునట్లైన, తప్పనిసరిగా యీ విధానంతో వివాదపడి ప్రతిఘటించి తీరాలి. ఇదే సమయంలో శక్త్యానుసరం, భక్తివిశ్వాసాలతో ప్రజలలో మన కార్యక్రమాన్ని కొనసాగింప బూనుకొన్నచో, కాంగ్రెసు సర్వబలాలను కూడగట్టుకొని, యీ పార్ల

మెంటరీ శిథిలాలనుండి కాంగ్రెసును వుద్ధరించి నిండు బలాన్ని చేకూర్చగలము.

ఇప్పుడు మనం రెండు ముఖ్యమైన నిశ్చయాలకు వచ్చాం (1) ఆగష్టు తిరుగుబాటురోజుల్లో విధంగానే కాంగ్రెసు పేరుతో వ్యవహరించడానికి నేడు సాధ్యంగాదు. (2) మనం కాంగ్రెసులోనే వుండి పనిచేయాలి. సమర వీరుల కందరకు ఒక ప్రస్ఫుటమైన రాజకీయమానసిక దృక్పథాన్ని చేకూర్చి, స్థిర సంకల్పమైన సహకార సద్భావాలతో పనిచేయుటకు, మనము యేమార్గాన్ని అనుసరించాలి అనునదే యిప్పటి సమస్య. కాంగ్రెసు లోనేగాక, యింకను అనేకరంగములలో మనము పని చేయాలి యని గుర్తించినపుడు, యీ సమస్యకు యింకా మితిలేని ప్రాముఖ్యము యేర్పడుచున్నది. కాంగ్రెసుకు వెలుపలనున్న ట్రేడుయూనియన్లలోను, కిసానుసభల లోను కూడా మనము పనిచేయవలసివున్నది. కాంగ్రెసు లోనే యేదో పొందికలేని వర్గంగా పనిచేయవలెనని తలిస్తే బహుశా; అది సాధ్యంకావచ్చునుకాని, మన ప్రస్తుత బాధ్యతలకు సమర్థనీయంగా నిర్వహించాలంటే పైన వివరించిన విధానంతో ఒక నిర్మాణాత్మకమైన వెలుగును జ్వలింపచెయ్యాలి.

చాల పట్టుదలతో యీ సమస్యనుగూర్చి ఆలోచించాను. నా సహచరులతో సమగ్రంగా సమాలోచనలు జరిపాను. నేడు మనము ఆవశ్యక మనుకొను నిర్మాణసంస్థకు సిద్ధాన్నంగా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ

తయారై వుందనే నిశ్చితాభిప్రాయానికి వచ్చాం. శ్రద్ధతీసుకొని పళ్ళను కడిగివేసి, మరల పునర్నిర్మాణము చేసినచో మన ఆశయసిద్ధికి అత్యద్భుతంగా సి. యస్. పి వుపయోగపడుతుందని నానమ్మకం. సి. యస్. పి ది. సెబాస్ అనిపించుకొన్న రాజకీయజీవితం. ఆగస్టువిప్లవంలో అనన్యసామాన్యకార్యభారాన్ని నిర్వహించిందని శల్యపరీక్ష జేయు విమర్శకులే అంగీకరిస్తున్నారంటే, దీని ఘనతకు యిదొక మేలిమివన్నె పాతపార్టీలో, నిర్మాణ విధానములో కొన్ని లోపాలున్నాయి. సోషలిస్టు, వామపక్షఐక్యతను సాధించుటకు యిదిచేసిన ప్రయత్నాలే దీనికి కొంతకారణం. ఈరుగ్మతను నిర్మూలించగలం— నిర్మూలిస్తాం. ఎక్కడో యే కొద్దిమందో వెనుకటి అపనమ్మకాలను విడనాడలేకున్నను, అత్యధిక సంఖ్యాకులు అమితసుహృద్భావముతోను, ఆశతోను, సి. యస్. పి పై ఆదరాభిమానాలను చూపిస్తున్నారని యీమధ్య ఆగష్టు సమరవీరులతో లభించిన పరిచయభాగ్యంవల్ల గ్రహించాను. కాన పైన నేను విశదీకరించిన విధంగా సి, యస్. పి. స్వాతంత్ర్య సమరవీరులయొక్క నిర్మాణ సంస్థగా మారిపోవాలి అనే నిశ్చితాభిప్రాయానికి వచ్చాను.

ఈ నిశ్చితాభిప్రాయాన్ని బలపరచే యింకో అదనపు కారణాన్ని యిప్పుడు తెలియజేసెదను. జాతీయస్వాతంత్ర్యానికివలెనే, సామ్యవాదానికికూడా, సి. యస్. పి. ఉత్కృష్టమైన అగ్రపీఠం. స్వాతంత్ర్యసమరవీరులలో నూటికి

తొంబదిపాళ్ళు సామ్యవాదాన్ని జీవిత పరిమాధిగా తలుస్తున్నారని నాకు గట్టినమ్మకమున్నది. సోషలిజములేని జాతీయస్వాతంత్ర్యము యేవిధముగను వారిని సంతృప్తి పరుపజాలదు. కాబట్టి యేవిధంగా జూచినను, సి. యస్. పి కి అగ్రతాంబూల మివ్వక తప్పదు.

## వామపక్ష ఐక్యత

ఈ నిర్మాణసంస్థకు అంతర్నిళితమైయున్నదే వామ్యపక్ష ఐక్యత. ఈ సమస్య చాలా గందరగోళం పట్టినట్లు నాకు కనిపిస్తున్నది. ఈ వామపక్ష ఐక్యత అనేది ప్రపంచంలోకి విసుకుపుట్టించు సమస్యలలో ఒకటి. ఈ ప్రశ్న ఉత్పన్నమైన మూలబీజాన్నిపోల్చి చూస్తే, దీని పరిష్కారానికి మార్గమేలేదని తట్టుచున్నది, వామపక్షఐక్యత అంటే, వివిధ వామపక్షములు గూడుపుల ఐక్యత అనే భావమైనచో, దీనిసాధన దుర్ఘటము. ఈవిధమైన ఐక్యత కావాలను వారు ముందు అనైక్యతకు కారణమేమిటో వారికి వారే ప్రశ్నించుకోవలెను. సూటిమాటలతో ప్రశ్నిస్తే, అసలు ప్రత్యేకప్రత్యేకంగా వివిధ వామపక్షపార్టీలు పుట్టుటకు కారణమేంటో తేల్చుకోవాలి. ఈప్రశ్న సావకాశంగా పరీక్షిస్తే మూర్ఖాభిమానములు, పక్షపాతములతో ఖండఖండములుగా యీ పార్టీలు యేర్పడుటకు యేకారణాలు దారితీసినవో, ఆకారణాలే ఐక్యతకుకూడా అడ్డంవస్తాయి.

ఏదో ప్రత్యేకపు అవకాశాలలో తప్ప-అది బహు కొద్దికాలమే- ఐక్యమాటకుగాని కనీసం కలసి పనిజేయుటకుగాని వామపక్షపార్టీలు ఒప్పుకోలేదని, ప్రపంచములోని వివిధవామపక్ష ఉద్యమముల చరిత్రలు చెప్పుచున్నవి. ఈ చరిత్రాత్మకమైన సాక్ష్యం ఖచ్చితంగా మనకు బుద్ధిగరపు పాఠం.

మన స్వదేశంలో మన అనుభవంకూడా యీ నిర్ధారణకేవచ్చింది. రెండుఘట్టలలో వామపక్ష ఐక్యతను వివరీత ప్రయత్నాలుచేశాము. ఈ ప్రయత్నముల మూలమున ఆశయము సిద్ధింపకపోవుట అటుంచి, కార్యక్రమ ప్రుపక్రమణకు వ్యాఘాతములగు బలవత్తరమగు అడ్డంకులకు ఆస్కారమైనది. వెనుక సి. యస్. పి హృదయపూర్వకంగా సింహద్వారమును దెరచి, అన్ని వామపక్షు సోషలిస్టు కూటములకు స్నేహపూర్వకంగా ఆహ్వానమిచ్చినపుడు; యీ అవకాశాన్ని తీసికొని వాటిప్రత్యేకపలుకుబడి నభివృద్ధి చేసుకోడానికి, సభ్యులచేర్చుకొని భూతగృహాల్ని నిర్మించుకోడానికి, "యింటివాసాలు లెక్కించుచు," వామపక్ష ఐక్యత అను మిషతో ప్రపంచమంతట ఆడిన నాటకాన్నే, యిచ్చట నక్కజిత్తులతో సాగించాయి.

కాని నావరకు నేను చెప్పుచున్నాను; యీ వామపక్ష ఐక్యతలో నాకు నమ్మకం లేదు; యింక యెన్నటికిని ప్రయత్నించటానికి ప్రాకులాడనుగూడాను. నామమాత్రపు ఉత్సాహాలను, మూర్ఖపు ముంకుపట్టుదలలను,

మాసివేసి, వామపక్షీయులు ఒకే పెద్ద మహాలులో చిన్న చిన్న గదులవలే కలసిపోయి, వామపక్షజాతీయతను, సామ్యవాదమును పెంపొందించుటకు ఒకే ఒకపార్టీని పునర్నిర్మించాలి. నేడు అటువంటి పార్టీ సి. యస్. పి ఒక్కటే. దీనిలోకూడా తప్పులు వెదకటానికి, కుంటిసాకులు చూపుటకు, యీనాటికీ సాధ్యమే. కాని మన మానసిక సందేహాలను మట్టుబెట్టి, ఒకదొడ్డదగు పథకాన్ని సరిదిద్దుకొనుచు, చేతులు చేతులు కలుపుకొని, స్నేహ పూర్వకంగా సాగిపోవుటకు ప్రతివామపక్షీయుడు పాటు బడాలి అని విజ్ఞాపనచేయుచున్నాను. మానసిక నిర్బంధా లను వైదొలగజేసి, సమిష్టిఆశయానికి విశాలమైన, గొప్ప హృదయముతో చేయూతనిచ్చుచు, సమిష్టియెత్తు లను, సువిశాలమగు సమిష్టిదృక్పథాన్ని అభివృద్ధి జేసుకొ పాటుబడ వేడుచున్నాను. ఇండియాలో వామపక్ష - సోషలిస్టు ఉద్యమము పెంపొందాలి అంటే...సంఘీభావ మునకు చేయి జాచుచునే, వారి ప్రత్యేకపు యెత్తుల సమర్థించుకొనుచు; కలసి కట్టుగా పనిచేద్దామనుచునే, శ్రోత్రసేకరణకు, పక్షపాతపు ప్రచారానికి ప్రాకులాడుచు; నిలకడ, నిశ్చయమునకు సావకాశమీయని వివిధగ్రూపు లను కూడగట్టుటకుమారు — ఒకబ్రహ్మాండమగు పార్టీ అభివృద్ధికి పాటుబడాలి. ఇండియాలో యీ మహత్తర కార్యభారాన్ని నిర్వహించుటకు సి యస్. పి. మినహా యింక యేదియును కనుపించుటలేదు. కాబట్టి ప్రతి స్వాతంత్ర్య సమరవీరుడును, సి. యస్. పి యే తను, తనే

సి. యస్. పి. అయిపోవాలని ప్రాధేయపడుచున్నాను. అధికసంఖ్యాకులు యిప్పటికే యీవిధంగాచేసి వేశారు. మిగిలినవారుకూడా యీమార్గాన్నే అనుసరించవలయునని విజ్ఞాపన చేయుచున్నాను.

స్థానిక నిర్బంధములు, వ్యక్తిగత విభేదాలు, పాత అపనమ్మకములు. కొందరిస్నేహితులను ముందుకు అడుగు వేయకుండ వారిమార్గానికి ప్రతిబంధకములు కావచ్చును; కాని మనశక్తికి మించిపోనంతవరకు, యీప్రతిబంధకాలను నిర్మూలించి, వీరిమార్గాన్ని సుగమంచేసి, శక్తివంతమగు నిర్మాణసంస్థను పెంపొందించుటకు, సహాకారముజేయు నవకాశము లేర్పరుస్తామని ప్రతి సమరవీరునకు ప్రతిన బూని చెప్పుచున్నాను.

## 4

## మన ప్రస్తుత కార్యక్రమము

పరిపూర్ణమగు రాజకీయప్రణాళి కనుగూర్చి యిచ్చట చర్చించుట నాకు యిష్టంలేదు. తర్వాత దానికొక అవకాశముంది — బహుశా అది పార్టీవిధానపు ప్రణాళికకావచ్చును. (Patys Statement of policy) వెన్వెంటనే కార్యక్రమానికి ఉద్యుక్తులము కాగల్గుటకు సాధారణపు వ్యూహాన్ని మాత్రమే మీముందు పెడతాను.

బహుశా మన భవిష్యత్తు పోరాటపు భవితవ్యరూపాన్నిగురించి తేల్చుకొన్ననేగాని, ప్రస్తుత మన

కార్యభారాన్ని అర్థము చేసుకోలేము. నా వ్యూహాలో వున్న ఫలకపురూపాన్ని మెరుకవరుస్తాను: నిలువనీడలేకుండా ప్రయత్నాలు ప్రయత్నాలుగా బ్రిటిషుసామ్రాజ్యానికి చెదరగొట్టగల్గునంతటి శక్తివంతములగు ఉపకరణములను సాధించుట మొదటిది. వెన్వెంటనే దేశములోని పట్టణాలు పల్లెలు అన్నింటిలోను స్వాతంత్ర్య ప్రభుత్వ యూనిట్లను నెలకొల్పి ముట్టడిబారినుండి కాపాడుట—ఈ స్థానిక, దేశవ్యాపితస్వరాజ్యప్రభుత్వాలను సంఘటితపరచియుండియూ స్వాతంత్ర్య రిపబ్లికును యేర్పరచవలెను. సహజంగా ఈ పద్ధతిలో అన్నిముఖాలా, సర్వవిధములా బ్రిటిషు అధికారముతో అసహాయోద్యమమును సాగించవలెను. కాంగ్రెసుమంత్రులు పరిపాలనమును నిర్వహిస్తానేలోపల నుండేపోరాటం సాగించడం కూడా యిందులో ఒకభాగం. దేశము మొత్తములో పారిశ్రామిక సమ్మెలనుకూడా సాగించాలి. జమీందారీ భూములను రైతుకూలీలు వశపరచుకోవాలి. సంస్థానాధీశుల నిరంకుశత్వమును తిరస్కరించుచు సంస్థానప్రజలు నిర్వహించుఉద్యమం ఒకఅంగం. 1942 తిరుగుబాటుకు, యింకను అంతకుముందు సాగిన పోరాటాలకు, దీనికి ఒకే సుప్రసిద్ధమగు తేడావుంటుంది. ఈసారి స్థానిక, ప్రాంతీయప్రభుత్వాలు యేర్పడి తర్వాత కార్యభారాన్ని యీ ప్రభుత్వాలే నిర్వహించవలెనని నా సంకల్పము. ఈ ఫలకానికి సమగ్రమగు నిర్వచనాన్ని యివ్వవచ్చును కానీ—యెందుకు సంగ్రహమగు వ్యూహాన్ని పైననే నిరూపించానుగదా.

ఈ ఫలకపు వ్యూహాన్ని ముందుంచుకొని మన ప్రస్తుత కార్యక్రమాన్ని సంగ్రహంగా విశదపరుస్తాను.

ఇంతకుముందు గమనించినట్లు మన జరూరైన కార్యక్రమము పోరాటానికిసర్వసన్నద్ధం కావడం. వివిధ రకములగు కార్యక్రమములు ఈసన్నద్ధతకు అంగములు. సహజంగా కొన్నిరకముల కార్యక్రమాన్ని మాత్రం యిచ్చుట నిర్వచించడానికి వీల్లేదు.

## వర్కరు

వర్కరును గురించి తెలుసుకుంటేనేగాని, కార్యక్రమాన్ని గురించి విచారణ సలుపలేము. ఈ స్థితిలో మన ముఖ్యతమమైన ఉద్యోగమేమిటని యీనాడు నన్ను ప్రశ్నించారనుము. వెన్వెంటనే వర్కరునుయోధులు, క్రమశిక్షణ యిచ్చుట అని నేను జవాబు యిస్తాను. ఇది అంత ముఖ్యమైనపని. ఆందోళనయే పోరాటమనునది గడచి పోయినసంగతి. అప్పుడేమనము విప్లవజ్వాలలోయున్నాము. అధికారమును హస్తగతము చేసుకొనుటే దీనికర్తవ్యం. యుద్ధానికి పూర్వమువలె గాక, యిప్పుడు మనకు ఒక ప్రత్యేక విశిష్టతగల కాంగ్రెసువాది, ఒక ప్రత్యేకపు స్థాయికిజెందిన పార్టీసహచరుడు ముఖ్యావసరము. నేటి విప్లవవాది, ఆందోళనలోనేగాక, చాలావరకు నిర్మాణ కార్యవిధానములో సమగ్రమగు క్రమశిక్షణపొంది యుండవలెను. నిర్మాణకార్యక్రమము, యింకా తదితర కార్యవిధానములలో యితనికి పరిపూర్ణమగు విజ్ఞానముండవలెను. విప్లవాత్మక నిర్మాణసంస్థను తను కార్య

క్రమము సాగించుచున్న ప్రజలకును మధ్యఅనుసంధాయకుడితడు. అంటే వీరికి విప్లవ ఉద్ధృతమును నూరిపోయుటే గాక, విప్లవములో వీరిస్థానము, నిర్వహింపవలసిన బాధ్యతగూడా తెలియజేయవలయు నన్నమాట. వినమ్రుడై, వినయవిధేయతలతో, నిర్భయముగా, డిసిప్లినుకు లోబడి, చెమటోడ్చి విరామములేక కార్యభారాన్ని నిర్వహించువాడుగా యితడు తయారుగావలెను. సమస్త కార్యక్రమానికి ఒకేవర్కరును దేకడం యెన్నటికీ పనికిరాదు. కాన సర్వసాధారణ క్రమశిక్షణయేగాక, వర్కరు యొక్క స్థాయిని శక్తిని గమనించి, ట్రేడుయూనియను కార్యక్రమము, గ్రామకార్యక్రమము, ప్రెస్సు, ప్రచురణకార్యక్రమము, మున్నగువానిలో దేనిలోగాని ప్రత్యేకపు క్రమశిక్షణ నివ్వవలెను. అప్పుడు వీరు యేరి వన్నె దిద్దిన వర్కర్లగా తయారౌతారు.

మనదేశము సువిశాలమైనది. అకస్మాత్తుగా తటస్థించు ఘట్టాలలో దేశము నలుమూలలనున్న విప్లవ యోధులకు, కేంద్రమునుండి సూచనలు జేరుట బహు కష్టము. కాబట్టి జాతీయవిపత్తు తటస్థించినపుడు, యేవిధముగా నడుచుకొనవలెనోగూడా స్థానిక నాయకులకు క్రమశిక్షణ నివ్వవలెను.

కార్యక్రమము, అధ్యయన, చర్చలు, యీ క్రమశిక్షణనిచ్చుటకు మూలాధారాలు. ఇంక క్రమశిక్షణకు చెందిన రెండవభాగంలో అంటే, పఠన వాగ్వివాదాలలో పరిపూర్ణత చేకూర్చుటకు, తాత్కాలికంగాగాని,

స్థిరంగాగాని, వీలునుబట్టి, అధ్యయనతరగతులను, పాఠశాలలను నెలకొల్పవలెను. దీనికి అధ్యాపకులు, వాఙ్మయము ముఖ్యావసరం.

## "ప్రత్యేకపు" కార్యక్రమము.

ఇంక కార్యక్రమముయొక్క కార్యాచరణను గూర్చి చర్చిద్దాం. బాహాటంగా చర్చించుటకు కార్యక్రమపథకాన్ని, సాధారణకార్యక్రమం, ప్రత్యేకపు కార్యక్రమం అను రెండుభాగాలక్రింద విభజిస్తాను. ట్రేడుయూనియన్లు, కిసానుసభ కార్యక్రమం, విద్యార్థి వాలంటీరు నిర్మాణ సంస్థలు, చేనేత సహకారసంఘములు, చెరకు ఉత్పత్తిదారుల సహకారసంస్థలు, సహకార వ్యవసాయము, యీ లక్షణాలుగల యితరకార్యక్రమములు రెండవహంశంక్రిందికి వస్తవి. ఈ విధమగు ప్రత్యేకపు కార్యక్రమానికి మనము కాస్తోకూస్తో పరిచయమైనాం. కాని యీ కార్యక్రమాన్ని చాలాక్రమబద్ధంగా నిర్వహించుచు, కొత్తరంగాలకు వ్యాపించునట్లు చేయాలి. క్రమశిక్షణ, విజ్ఞానము, అధ్యయనము దీనికి జతపరచాలి. విప్లవవిధానము, సాంఘిక సిద్ధాంతములు యీ మొత్తము విధానమునకు ప్రాణముబోసి, నిజాయితీ మార్గమున నడుచునట్లుచేయాలి. ఏదో ఆర్థిక సదుపాయములకొరకో, లేదా వట్టి ఆందోళనకో ప్రదర్శనాలకో దిగజారిపోయి; పొందిక, పోలికా లేని భిన్నభిన్న ఉద్యమములుగా తయారుకానివ్వరాదు. సహకార

సంస్థలు, ట్రేడుయూనియన్లు, కిసానుఉద్యమములు, బహు సులభంగా యీ ఆర్థిక సమస్యలవైపుకు పరుగిడ వచ్చును. దీనిని ప్రతిఘటించాలి. తర్వాత వాలంటీరు, విద్యార్థి ఉద్యమములు: తీసికొనుడు; వాలంటీరుదళములు వ్యాయామము, దేహపరిశ్రమ, గుంపుల అజమాయిషీ, ప్రదర్శనములకు మాత్రమే అంటిపెట్టుకొనియుండగూడదు. ప్రతి వాలంటీరు యెంత అణకువకైన తలయొగ్గి తనప్రాంతము వారితో – కనీసం ఆఫీసర్లతోనైనను–సహాయపడుచు, రానున్న విప్లవములో యీ ప్రజలస్థానము, నిర్వహించవలసిన బాధ్యతలు తెలియజెప్పుచు, కార్యక్రమాన్ని సాగించవలెను. విద్యార్థికాంగ్రెసు చరిత్రంతా ఆందోళనతోనే సరిపోవుచున్నది. ఇదిచాలదు; వారు నివసించు ప్రాంతములలోను, తోటి విద్యార్థులలోను, యీ కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించాలి. విద్యావిధానము (బీదపిల్లలకు విద్య నేర్పుట; వయోజనవిద్య, హిందుస్థాని ప్రచారము, విజ్ఞానకార్యక్రమము — చర్చలు, సభలు కళాప్రదర్శనము, నాటకములు) ఆరోగ్యశాఖ, పర్యాలోకన ట్రేడుయూనియను తత్సంబంధమైన ఉద్యమములకు సాయపడుట, విహారము, సెలవుదినాల్లో గ్రామకార్యక్రమము, విద్యార్థి ప్రయోజన కేంద్రాలు, స్వయంసేవకసంఘాలు, మున్నగునవి యిందులకు ఉదాహరణాలు.

## ట్రేడుయూనియన్ కాంగ్రెసు

ముఖ్యంగా మనదేశంలో ట్రేడుయూనియన్ ఉద్యమము రాజకీయంగా చాలా వెనుక బడివుంది. దీని

లోని దుర్బలత, మరీయుద్ధంజరిగిన సంవత్సరాలలో బాగా బట్టబయలైంది. ఈరోజులలో అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు, యిండియాలోని కార్మికులకు సరియగు రాజకీయ నాయకత్వాన్ని యిచ్చి నిర్వహించలేక పోయింది. దేశము మొత్తము విప్లవపు టుప్పెనలో మునిగి తేలుచు అధికసంఖ్యాకులగు కార్మికులు దీనిలోకలసి పోవుచున్నపుడుగూడా, యీ అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు అయోమయంలో చచ్చుబారిపోయి విప్లవాన్ని బలపరచాలనో లేదా సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని సమర్థించాలనో తేల్చుకోలేక పోయింది. దీనికంతకు మూలకారణము యిండియా కమ్యూనిష్టుపార్టీ దేశద్రోహకర విధానము. ట్రేడుయూనియన్ కాంగ్రెసు లోని యీ రాజకీయ దుర్గతను నిర్మూలించి, యీ ఉద్యమాన్ని కూడా విప్లవపుపోరాటపు శ్రేణిలో నిలువబెట్టవలెను. కార్మికులు వారివిధిని నెరవేర్చుటకు అవకాశమును కల్పించవలెను,

కిసాను ఉద్యమంకూడా గందరగోళముబట్టి బీట్లువారిపోయింది. దీనికికూడా కమ్యూనిష్టుల కుతంత్రాలే కారణం. జాతీయపోరాటానికి సంబంధించినంతవరకు కిసాను ఉద్యమాన్ని సంఘటితపరచి, మొత్తపు ఉద్యమాన్ని పునర్నిర్మాణము చేయాలి.

ఉత్పత్తిదారుల సహకారసంస్థలు, సహకార వ్యవసాయములకు సంబంధించిన కార్యక్రమము, నేను సూచించు క్రొత్తవిధానపు కార్యక్రమం. ఇంతకుముందే

చదరుగా, ఏ కోనలనో యీ వుద్యమం ప్రారంభింపబడి యుండవచ్చును కాని, సాధారణంగా మాట్లాడితే యిది సరిక్రొత్తవిధానము. సరియగు దశములు, అవసరమగు పరిస్థితులకు ఉపకరించు ప్రతిచోటను, ఈమార్గాన కార్యక్రమం ప్రారంభింపబడాలి.

అనుమతి, ఆదరణలు సేకరించుట, మన కార్యక్రమపు పెద్యాలులో ముఖ్యమైన హంశమని, యింతకుముందే నిక్కచ్చిగా నేను తేల్చి చెప్పాను. నేనుముందు తేల్చి చెప్పినది మీకు బాగాస్ఫురించుటకు, మరల యిచ్చట యీవిషయాన్ని తిరిగి హెచ్చరించాను,

మన బాధ్యత స్వీకరించవలసిన ప్రత్యేకపు కార్యక్రమ ప్రణాళికను సంపూర్ణంగా యిచ్చట యేకరవు పెట్టుటలేదు. పైన వివరించినది సంగ్రహామగు స్వరూపం. దీనికి అదనంగా అత్యంత ప్రత్యేకత గల్గిన యింకో కార్యక్రమం (స్త్రీలలో చైతన్యము గొనివచ్చుట) యిక్కడ ఉదహరిస్తాను. ఈ ముఖ్యాతిముఖ్యమైన కార్యక్రమాన్ని గూర్చి సమగ్రంగా భోగట్టానివ్వగల సమర్థులు తర్వాత దీన్ని గురించి విశదపరుస్తారు. ఇంక తర్వాత సూచనలకు గాంధీజీ నిర్మాణకార్యక్రిమే వున్నదిగదా. అస్పృశ్యతానిర్మూలనము, మద్యపాన నిషేధము, గ్రామ ఆరోగ్యవిధానము; వయోజనవిద్య, మున్నగు కొన్ని భాగములను తీసుకొని పనిచేయుచు, మన కార్యక్రిమ ప్రణాళికలో కలుపుకొనవచ్చును. ఒక్కమాటలో చెప్పాలంటే – ప్రజలసేవజేయుచు, ఆర్గనైజుచేయుచు,

విద్యాగరపుచు, పోరాటానికి, సమర్ధవంతులుగాను, శక్తివంతులుగాను చేయుటకు, కొల్లబోవునంత కార్యక్రమ మున్నది. ఈ కార్యక్రమాన్ని సక్రమముగా సరియగు విధానములో కొనసాగించుటకు వర్కర్లుమాత్రమే చాలా తరుగుగా నున్నారు.

## "సాధారణ" కార్యక్రమము

ఇంక సాధారణ కార్యక్రమాన్నిగూర్చి తెలుసు కొందాం. కాంగ్రెసుకు అండమై, కాంగ్రెసును బలపర చుచు, కాంగ్రెసు పలుకుబడినే అభివృద్ధిజేయుటకు పాటుబడుట, యీ హంశంకింద కార్యక్రమానికి ముఖ్యాంశం. ఇదివరకంటే యెన్నోరెట్లు పలుకుబడిని యిప్పుడు కాంగ్రెసు ప్రజలపై సంపాదించుకొనివుంది. కాని దీన్ని కాంగ్రెసు నిర్మాణవిధానంతో పోల్చిచూస్తే మొద్దుబారి పోయింది. ఈ పార్లమెంటరీ కార్యవిధానమువల్ల అత్యంతంగా అవకాశవాదం బలిసిపోయింది. కాంగ్రెసునంఘాల్లో చురుకుదనాన్ని కొనివచ్చి,వీటికిని ప్రజలకును మధ్య గాఢతరమగు పరస్పర సంబంధముల కలుగజేయగల్గు, ప్రజా సేవాదళములను తయారుచేయడం మన ప్రథమబాధ్యత. జాగరూకత వహించి యేరూపంలోనైనా కాంగ్రెసులో నున్న అవకాశవాదాన్ని పారద్రోలుట మనరెండవ బాధ్యత.

"కాంగ్రెసు సంఘాల్లో చురుకుతనం తేవాలి"అను నినాదం పరిపాటి అయిపోయింది, కాబట్టి దీన్నిగురించిన

నా అభిప్రాయాలను సువిశదపరుస్తాను. అఖిలభారత కాంగ్రెసుసంఘం, రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాలు బాధ్యత స్వీకరిస్తేనేగాని, జబరదస్తీగా యీ కార్యక్రమము సాగి పోగలదు. కాలానుగుణ్యంగా తాకీదులనివ్వడం యీ సంఘాల ప్రథమబాధ్యత. ప్రతికార్యక్రమానికి నిర్ణీతకాల వ్యవధిని నిర్ణయించాలి. "ఈ పరిశోధన చేయాలి; యీ విధమగు ప్రచారమును ప్రారంభించాలి," అనినిర్ణయించుట కూడా యీ సంఘాలవిధి ఉదాహరణకు — అస్పృశ్యతా నిర్మూలనము; మతసామరస్యము; వయోజనవిద్య; ధాన్యపుబ్యాంకులు; గ్రామకార్యక్రమానికి వాలంటీర్లను చేర్చుకొనుట; మున్నగునవి శ్రద్ధతీసుకొని పనిచేయవలసిన అంశాలు. సందర్భానుసారంగా యెప్పటికప్పుడు, వర్కర్లకు ప్రచారపుసూత్రాలను, తదితర వాఙ్మయమును, అందజేయుచు; ప్రతిసమస్యను అర్థముచేసుకొని, దైనందిన కార్యక్రమంలో సహాయపడుటగూడా యీ సంఘాల ముఖ్యకర్తవ్యము. పరిశోధనకార్యక్రమము; రాజకీయపు యెత్తుగడలనుగూడా యీ కమిటీనిర్వహించాలి. సమగ్రంగా నిర్వచించుచున్న యీ కార్యక్రమాన్నంతా, తమ స్వంత బాధ్యతలక్రిందకు తీసుకొని; ఆచరణలో పెట్టుటకు, యీ కేంద్రసంఘాలు యెందుకు తాత్సారము జరుపవలెనో నాకు బోధగావటంలేదు. అసలు యీ వుద్దేశ్యమే వుంటే యెప్పుడు యీ సంఘాలు యీ మార్గంలో నడువ ప్రారంభిస్తారో, యీనాటికి కూడా నేను గట్టిగా చెప్పలేకున్నారు. ఈమధ్యకాలంలో కాంగ్రెసు

కమిటీలద్వారా పని చేయుటకు వీలున్న ప్రతిచోటను; పైన వర్ణించిన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుట మనముఖ్యమైన ఉద్యోగము. ఈ విధంగా సాధ్యంగాని చోట్ల పార్టీ శాఖలమూలంగా యీ కార్యక్రమాన్ని కొనసాగించడానికి పూనుకోవాలి. ఈ శాఖలలో నిఖాల సైన ప్రతి స్వాతంత్ర్యవీరుని కూడగట్టుకొని వచ్చుటకు ప్రయత్నము చేయవలెను.

ఈ సాధారణ కార్యక్రమములోని యితర భాగాలను చర్చించుటకు ముందు; యీపదాన్ని యేఅర్థంలో వాడు చున్నానో తెలియజేయవలెను ఇదివరకు గమనించినట్లు మన ప్రత్యేక కార్యక్రమము, ప్రజలలోని వివిధ శాఖలకు వర్గములకు సంబంధించి యున్నవిగదా. ఇట్లుగాక, ఒక గ్రామాన్నిగాని, పట్టణాన్నిగాన్ని, పట్టణములో వార్డునుగాని, ఒక ప్రత్యేక ప్రాంతముగా తీసుకొని చేయు కార్యక్రమాన్ని సాధారణకార్యక్రమము అంటాం. ఒక గ్రామంలో కిసానుసభగాని లేదా ఒకపట్టణములో ట్రేడుయూనియనునుగాని నిర్వహించునపుడు దానిని ప్రత్యేకకార్యక్రమము అంటాం. కాని యీగ్రామం మొత్తాన్నిగాని, పట్టణం మొత్తాన్నిగాని తీసుకొన్నపుడు, అది సాధారణ కార్యక్రమం క్రిందికివస్తుంది.

## గ్రామ కార్యక్రమము

ఇంక గ్రామకార్యక్రమానికిపోదాం. ఆరు నెలలతర్వాత గ్రామస్వరాజ్యాన్ని స్థాపించుట గురిగా పెట్టుకొన్నా మను

కొనుము. ఈ గ్రామ స్వరాజ్యమంటే; గ్రామ స్వపరిపాల నాన్ని నిర్వహించునట్టి గ్రామరిపబ్లిక్ అని అర్థంగాని, ఈనాటి గ్రామపంచాయితీలు గాదునుమా. గ్రామస్థులు వారికివారే శ్రద్ధతీసుకొని, వారి ప్రోత్సాహముతో వారే స్థాపించుకోవలసినదిగాని యీ గ్రామస్వరాజ్యము ప్రభుత్వ యేజంట్లు సృష్టించునదిగాదు. నా దృక్పథంలో వున్న గ్రామస్వరాజ్యం, విదేశపాలనాన్ని తోసిరాజని విప్లవంరోజుల్లో పోరాటానికి ప్రతిఘటనకు కేంద్రము లై; స్వాతంత్ర్యయిండియారిపబ్లిక్ అను మహాసౌధమును నిర్మించుటకు; పటుత్వముగల యిటుక రాళ్ళను తయారు చేయవ్రానుకొను సామర్థ్యము గలది.

గ్రామాలలో యిట్టి గ్రామస్వరాజ్యాలను స్థాపించుటకుముందు చాల నిర్మాణకార్యక్రమాన్ని కొనసాగించవలసియున్నది. దీనికి యీక్రింద నిరూపించిన రకముల కార్యక్రమములను ఆచరణలోనికి తేవలయును.

1. కాంగ్రెసు సభ్యులచేర్చుట: ప్రతి వయోజన గ్రామస్థుని విధిగాచేర్చాలి. చేర్చినసభ్యుల సమావేశ పరచి సభలుజరుపవలెను. పతాకవందనము చేయించవలెను.

2. వైజ్ఞానిక కేంద్రాలను యేర్పరచాలి: ప్రతి కలుచదువుట, వయోజనవిద్యా కార్యక్రమము, నాటకాలు, పల్లెపాటలు, అధ్యయనతరగతులు వ్యవసాయ సలహాలు మొదలగునవి.

3. సేవాదళములు, అఖండ కార్యక్రమము.

4. కార్యరూపేణా, ఆరోగ్యశాఖ,రస్తాలు కట్టలు వేయించుట మున్నగుసమస్యలు పరిష్కరించాలి. సమాజపు అవసరాలకు సమిష్టిగా పాటుబడు విధానమును ప్రోత్సహించాలి.

5. అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమము.

6. మతసామరస్యము.

7. మద్యపాన నిషేధము.

8. పరిస్థితుల సింహావలోకనము.

9. కష్టముల కాదుకొనుట

10. ధాన్యపుబ్యాంకుల స్థాపించుట.

11. యిరుగుపొరుగు గ్రామాలలో ప్రచారము.

12. సహకార వ్యాపారము.

13. స్త్రీలు, పిల్లల కార్యక్రమము.

వినమ్రులై, కార్యక్రమానికి అంకితమైనవర్కర్లు, గ్రామస్థుల సహకారమును సేకరించుకొని, యీ సహజలక్షణములుగల కార్యక్రమమును నిర్వహించినపుడు, కొద్ది మాసాలలోనే యీ విధమగు గ్రామ స్వరాజ్యాన్ని స్థాపించుట సులభసాధ్యమగును. అప్పుడు యిట్టి గ్రామములలో, సహకార వ్యవసాయమును, గ్రామోపయోగమునకు అనుబంధములగు సహకార పరిశ్రమలనుగూడా స్థాపించుట సులభము;

ఈ కార్యక్రమ ఆచరణకు, ఘట్టిగాక్రమశిక్షణ పొందిన మెరికలవంటి వర్కర్లు లెక్కకు మిక్కుటముగా కావాలి. అప్పుడు యీ కార్యక్రమ విధానము

యిండియా ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవితములోనికి చొచ్చుకొని పోతుంది. అప్పుడు యిది విప్లవాత్మకమైన నిర్మాణవిధానమునకు ప్రాతిపదికలై దీని సాధనకు ఉపి గొల్పుతుంది.

పట్టణాల్లోగూడా యీవిధమైన కార్యక్రమాన్ని కొనసాగించవచ్చును. పట్టణములు; నగరములలోని వార్డులు; మొహల్లాలు; ఒకప్రత్యేక ప్రాంతముకింద తీసుకొనవలెను. ఈ వార్డులలో ఒకటిగాని, అంతకుమించి గాని, కేంద్రాలను స్థాపించి, గ్రామకార్యక్రమము క్రింద నిర్వచించిన కార్యక్రమానికి, పట్టణపు సమస్యల కను వగు విధానమునుగూడా కలుపుకొని కార్యక్రమాన్ని సాగించవలెను. ఈ కార్యక్రమములో నగరములలోని బీద సాద వర్గములను కలసికొనుట ముఖ్యావసరము. వీరికి అవ సరమగు సేవావిధానము, విద్యాప్రచారము నిర్మాణ విధానమును నిర్వహించుచు అభివృద్ధిలోనికి తేవలెను. విద్యార్థికాంగ్రెసులోని చురుకైన సభ్యులను, యీ కార్య క్రమములో పాల్గొనుటకు ఆహ్వానించవలెను.

ఈ కార్యక్రమ ప్రణాళికను యింకా సమగ్రంగా చర్చించవచ్చును గాని, స్థూలరూపంగా యీఫలకమే దానివిధిని అది బోధించగలదు. స్థానిక ప్రోత్సాహము యింకా యెక్కువగా గడించిన అనుభవము, మూలమున దీనికి కొంత కలుపుకొనుటగాని, లేదా కొంత తగ్గించుట గాని చేయవచ్చును. దీన్ని యిప్పుడు మీముందు వుంచు

చున్నాను. దీనివల్ల మీరు కొంత వుపయోగాన్ని పొందగలరని ఆశిస్తున్నాను.

ముగించేముందు మన గమ్యస్థానముగు విప్లవ సాధన వైపుకు ఒకసారి దృష్టి సారించి చూచుట ముఖ్యం. ఇదే కార్యక్రమాన్ని వివిధమార్గములలో వివిధములగు ఆశయముల సిద్ధికొరకుసాగించవచ్చునుసుమా—దీనిని గుర్తుంచుకోవాలి. ఈ కార్యక్రమాన్ని ఆచరించుచు దీన్ని విప్లవానికి ఒక ఆయుధంగా చేసివేయడం మన మనోవాంఛితను శాసించు అంకుశం.

ఢిల్లీ,
28, జులై 1946.

మీ ఆప్తుడు,
జయప్రకాశ నారాయణ.

---

(ఈ కార్యక్రమాన్ని; పలుచోట్ల, సోషలిస్టు పార్టీలు, 9 ఆగస్టు, 1946 నుండి ఆచరణలోకి తెచ్చినవి)

వాసుదేవా ప్రెస్, హైదరాబాదు.

# సామ్యవాద సాహిత్యం

1. తిరుగుబాటుదారులు పురోగమించాలి
( రామమనోహర లోహియా )
2. జయప్రకాశ్ : ఆగస్టువిప్లవం : దాని ఆవశ్యకత
3. కాగ్రెసు సోషలిస్టు నాయకులు
4. పాకిస్తాన్ – మార్క్సిజం

( అచ్చులో )

1 తిరుగుబాటునాయకుల బహిరంగలేఖలు
(జయప్రకాశ్; లోహియా; పట్వార్థన్; అరుణ)
2. ఇండియా సోషలిస్టు రిపబ్లికు
(ముదివర్తి సత్యనారాయణ)

లాల్ బుక్ డిపో,
గవర్నరుపేట, బెజవాడ.